

JOTHEE

యస్.వి.యస్. ఫిలిమ్స్

# నిండు మనసులు

నిర్మాత: యం. జగన్నాధరావు దర్శకత్వం: యస్.డి. లాల్

ఆంధ్ర జ్యోతి పిక్చర్స్ వైజాం: ఉషా ఫిలిమ్స్ సీడెడ్: నవభారత్ ఫిలిమ్స్ మైసూర్: శివశంకర ఫిలిమ్స్

**LitQuiz No. 19** FAMINE RELIEF FUND: Rs. 1,000

**Rs 25000**

FIRST PRIZE: Rs. 12,500

TRANSISTOR MINIQUIZ For Every All-correct Winner — murphy

RUNNERS-UP :- UPTO 4 ERRORS

\+ MINIQUIZ :- UPTO 2 ERRORS

THESE WINNERS WILL SHARE THE BALANCE PROPORTIONATELY

ఆఖరు ముగింపు తేది: 17—8—67.
**సొల్యూషన్ భారత్ జ్యోతిలో: 20—8—67.**
ఫలితాలు భారత్ జ్యోతిలో. 3—9—67.
* సొల్యూషన్ వెంటనే పొందుటకు 6 పైసల స్టాంపు, స్వంత అడ్రసు గల కార్డును ఎంట్రీతో పంపవలెను. * మీ ఎంట్రీలను 16 ఆగస్టు, బుధవారమునాడు కూడా పంపవచ్చును. కాని వాటిని ఎక్స్‌ప్రెస్ డెలివరీలో పంపవలెను.

## లిట్‌క్విజ్ నెం. 20 అధికార ఎంట్రీ ఫారము

**లిట్‌క్విజ్ నెం. 20, అలంకార్. బలరాం వీధి, బొంబాయి-7 (WB)**

షరా:— (1) ఒక్కొక్క లైనులో మీరు వద్దనే పదమును కొట్టివేయుండి. (2) ఒక కూపన్ మాత్రం పంపినచో రెండవ కూపన్ కొట్టివేయండి. (3) ఎంట్రీ రుసుము M.O. ద్వారా పంపినచో, పోస్టాఫీసు నుండి పొందిన M.O. రసీదును ఎంట్రీ ఫారమునకు జతపరచవలెను. M.O రసీదు లేని ఎంట్రీ నిరాకరింపబడును. (4) I.P.O. క్రాస్ చేయవద్దు. అది లిట్‌క్విజ్ నెం. 20, బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను.

| 1 | Re. 1 | * | 2 | Re. 1 | * |
|---|---|---|---|---|---|
| 1 | ART | RELIGION | 1 | ART | RELIGION |
| 2 | BEAUTIFUL | FRUITFUL | 2 | BEAUTIFUL | FRUITFUL |
| 3 | BEAUTY | JOY | 3 | BEAUTY | JOY |
| 4 | CAPACITY | UNITY | 4 | CAPACITY | UNITY |
| 5 | CHEERFULNESS | GREATNESS | 5 | CHEERFULNESS | GREATNESS |
| 6 | CREATIVE | INTENSIVE | 6 | CREATIVE | INTENSIVE |
| 7 | DEEDS | IDEALS | 7 | DEEDS | IDEALS |
| 8 | EMOTIONAL | POLITICAL | 8 | EMOTIONAL | POLITICAL |
| 9 | FEARLESSNESS | SELFLESSNESS | 9 | FEARLESSNESS | SELFLESSNESS |
| 10 | HUMANITY | SANITY | 10 | HUMANITY | SANITY |
| 11 | IDEAL | MORAL | 11 | IDEAL | MORAL |
| 12 | KNOWING | MEETING | 12 | KNOWING | MEETING |
| 13 | NATIONAL | PRACTICAL | 13 | NATIONAL | PRACTICAL |
| 14 | PROSPERITY | SECURITY | 14 | PROSPERITY | SECURITY |
| 15 | RELIGIOUS | RIGHTEOUS | 15 | RELIGIOUS | RIGHTEOUS |
| 16 | SANCTITY | SIMPLICITY | 16 | SANCTITY | SIMPLICITY |
| 17 | SEND | SPEND | 17 | SEND | SPEND |

SEND THESE 2 COUPONS & ENTER MINIQUIZ FREE (20)

**MiniQuiz**

10 CLUES FREE COUPON

| | | | |
|---|---|---|---|
| ART | RELIGION | FEARLESSNESS | SELFLESSNESS |
| BEAUTY | JOY | NATIONAL | PRACTICAL |
| CHEERFULNESS | GREATNESS | PROSPERITY | SECURITY |
| CREATIVE | INTENSIVE | RELIGIOUS | RIGHTEOUS |
| EMOTIONAL | POLITICAL | SANCTITY | SIMPLICITY |

**20** (ASVP)

ఈ క్విజ్ ప్రవేశమునకు చెందిన నిబంధనలను షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను. మరియు కాంపిటేషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు. 1/- ఈ పూర్తి ఎంట్రీ ఫారం ఎంట్రీ ఫీజు రు. 2/- M.O. రసీదు/I.P.O./లిట్‌క్విజ్ క్యాష్ రసీదు/క్రైజుకార్డు జతపరుస్తున్నాను. వాటి నెం. ..............................

CAPITAL LETTERS

NAME ..............................................................

ADDRESS..............................................................

..............................................................

ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను

## 17 CLUES

1 Every form of **Art / Religion** is an appeal to a hidden faculty in man which is the intuition.

. Nothing is truly good without being **Beautiful / Fruitful.**

3. The poet is the seeker of **Beauty / Joy** while the philosopher's aim is truth.

. In any democratically organised institution success or failure ultimately depends upon the will and the **Capacity / Unity** of the people who run the same.

5. A great one always radiates **Cheerfulness / Greatness.**

6. In reality religion is a creative experience and, like any other branch of learning or any of the magnificent fields of art, it calls for **Creative / Intensive** effort.

7. Our **Deeds / Ideals** are our clues to God.

8. Students of human nature would agree that indiscipline among students is not as much the outcome of ideological factors as of the **Emotional / Political** ones.

9. Ahimsa demands utter **Fearlessness / Selflessness.**

10. What mankind today wants is a return to **Humanity / Sanity**

11. The inspiration of Duty alone can make an act **Ideal / Moral.**

12. Religion is the human way of approaching and enjoying the Divine; Spirituality is the divine way of **Knowing / Meeting** the Divine

13 Intellectual activities are more strongly stimulated when they are directed to **National / Practical** ends.

14. The common man desires peace, **Prosperity / Security,** and his lost freedom.

15. The attitude of the truly **Religious / Righteous** man is toleration.

16. **Sanctity / Simplicity** is for the spirit what athletics are for the body.

17. It is dangerous to give money to him who does not know how to **Send / Spend** it.

గమనిక : పై క్లూలు గ్రంథకర్తలు, రచయితల పుస్తకముల నుండి తీసుకొనబడినవి. అవి పూర్తి వాక్యములు మరియు వేరువేరుగా పూర్తి అర్థవంతమైనవి. గ్రంథకర్తలు రచయితల పేర్లు, వారి పుస్తకముల పేర్లు సొల్యూషన్‌తోపాటు లిట్‌క్విజ్ పీక్లీలో ప్రచురించబడును.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 18-8-'67

ప్లవంగనామ సం|| శ్రావణ మాసం శు|| త్రయోదశి

సంపుటము: 59 సంచిక: 49

స్థాపితము
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: 'భారతమాత'
చిత్రకారుడు: శ్రీ గోనిపెట్ల

# ఎన్నో రకాలు ఎన్నుకోవడానికి

రేడియోలు మరియు ట్రాన్సిస్టర్లు
రు. 125 లు మొదలుకొని వున్నాయి





మోడెల్ టిఎ 0816



మోడెల్ టిఎ 0581



మోడెల్ టిఎ 0579



మోడెల్ టిఎ 0509



మోడెల్ టిఎ/టియు 0777



మోడెల్ టిఎ 0926



మోడెల్ టిఎ/టియు 0202



మోడెల్ టిఎ/టియు 0776



మోడెల్ టిఎ/టియు 0824



మోడెల్ టిఎ 0366

వాటిని మీ స్నేహితుడైన మర్ఫీ డీలరు వద్ద యీరోజే చూడండి.

**murphy** మర్ఫీ మీ గృహానికి ఆనందాన్నిస్తుంది!

*Murphy sets the standard*

HAS 31426

శ్రీమతి గాంధీని సవాలుచేస్తున్న ప్రతిపక్షాల వైఖరి:

# మధ్యప్రదేశ్‌లో కాంగ్రెసుపతనం

అఖిలభారత కాం:గెసు అధ్యక్షుడు శ్రీ కామరాజుగారు భారతదేశ ప్రజాస్వామ్యాన్ని రక్షించారు!

ఒక 'హిందువు' తన అధికారాన్ని పంచి పెట్టడానికి ఎప్పుడూ ఒప్పుకోడు. భార్యతో పంచుకోడానికయినా సరే అంతే! పైకి చూడ్డానికి చాలా ఘోరంగా కనిపిస్తుంది కాని, ఇది మాత్రం నిజం! పండిట్ డి.పి. మిశ్రాగారున్నారు. ఆయన మధ్యప్రదేశ్ పరిపాలకుడుగా అయ్యారు. ఒక విధంగా చెప్పాలంటే ఆయన శ్రీమతి గాంధీ గారికి 'నంబర్ వన్ సపోర్టరు'. కాంగ్రెసు పార్టీకి చెందిన ఏ అల్లికొడుకూ తన పార్టీని దాటి మరో పార్టీలో చేరడు, అనేది ఆయన దృఢమైన అభిప్రాయం. ఈ అభిప్రాయానికి అర్థం లేకపోలేదు. కాంగ్రెసులోని సభ్యత్వంలో అంత చక్కని వ్యాపారం వుందన్నమాట! శాసనసభ్యులు ఎవరైనా మరో పార్టీలోకి దాటేస్తూ వుంటే వెంటనే 'పచ్చదీపం' చూపించడానికి కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గం ఏర్పాటు చేసి వుంది. కోటు, టోపీ మార్చడమనేది 'వన్ వే ట్రాఫిక్'గా లేవడమే ఇందుకు కారణం.

ఈ 'దాటు వేయడా'న్ని చట్టబద్ధం చేయడానికి మధ్యప్రదేశ్ కాంగ్రెసు పార్టీ మెంబులవారు ఉబలాట పడుతున్నారు. ఇంతటి ఆదర్శం కలవారూ వ్యతిరేకదిశలో దాటువేస్తూ వుండగా పప్పులో అడుగువేసి, జారి, గ్వాలియర్ రాజమాత పక్షాన్ని చేరిపోయారు!

సుఖాడియాగారు ఈ బారినుంచి తప్పించుకుందామని చూస్తుండగా 'మిశ్రాషాహి' రంగంమీదకు వచ్చేసింది. ఆయన గవర్నరు రెడ్డిగారికి ఒక ఉచిత సలహా ఇచ్చారు. గ్రుడాలన్నింటినీ సవరించడానికి కొంత సమయం కావాలి, శ్రీమతి గాంధీగార్ని ఒప్పించడానికి కూడా ఒక సందర్భం అవసరం, కాస్సేపు ఆగుదాం అన్నారు. వెంటనే తుర్రుమని ఢిల్లీకి పరుగెట్టుకొచ్చారు. అయినా గవర్నర్ రెడ్డిగారు అనుసరించారు. తదనంతరం గ్వాలియర్ రాజమాత బంధుమిత్ర సపరివారంగా వచ్చి వాలారు.

పండిట్ మిశ్రాగారు రాజమాత పార్టీ అధికారంలోకి రాకుండా వుండాలని భగవంతుడ్ని ప్రార్థించారు. తను కృషిచేశారు. ఆయన నినాదం ఏమిటి అంటే, ఒక్క డి. పి. మిశ్రాగారు మాత్రమే మధ్యప్రదేశ్‌ను పరిపాలించాలి. వేరే ఎవరికీ ఆ అధికారం ఉండకూడదు! అందుకని ఆయన ఒక ప్రకటన చేశారు. మాలో బలం తగ్గిపోయిందని, ఓడిపోయామని ఎవరన్నా అనుకుంటూ వుంటే, రంగం మీదకు వచ్చి మళ్ళీ ఎన్నికల్ని జరిపించి చూడండి. మేమే నెగ్గితీరుతాం. అని ఛాలెంజి చేశారాయన. శ్రీమతి గాంధీగారు 'ఆయన ఛాలెంజికి 'శహభాష్' అన్నారు. మరికొందరు వందిమాగధులు ఒకపాట పాడయడానికి వెంటనే బయిరాయించారు. లోక్‌సభలో మెజారిటీ లేకపోతే మళ్ళీ ఎన్నికలు ఎక్కడవచ్చి పడతాయో అనేది వారిభయం మరి! మధ్యప్రదేశ్‌లో కనీసం సంయుక్త పరిపాలనకన్నా అవకాశం ఏర్పరచాలని ఈ పెద్దలు ఎంతో కృషిచేశారు.

మధ్యప్రదేశ్ శాసనసభలో 'అప్రోప్రియేషన్ బిల్లు'ను ప్రవేశపెట్టడానికి జాలై 31 వ తుది తేదీగా నిర్ణయించుకున్నారు. అధ్యక్షుని పరిపాలనకు, ఎన్నికలకు ముందే బడ్జెట్టునంతా భోపాల్‌లో అందంగా అచ్చొత్తించారు శ్రీ మిశ్రాగారు. ఇక్కడ, శ్రీ కామరాజ్‌గారు అడుగు పెట్టారు. ఆయన, రాజమాత పార్టీ ప్రతిభావిశేషాన్ని ప్రదర్శించుకోడానికి ఎంతో అవకాశం ఇచ్చారు. మిశ్రాగారికి కొంచెం దెబ్బ తగిలింది. న్యూఢిల్లీలో తనకు ఎదురు చెప్పేవారున్నారూ అంటే ఆయనకు ఎంతో ఆశ్చర్యం వేసింది!

అంతా అయిపోయాక దేశీయాంగశాఖ ఓడిపోయింది అని పైకి అని; లోలోపల 'మిశ్రాషాహి'కి ఎంతగతి పట్టింది అనుకున్నారు!

శాసన పండితులు కొందరున్నారు. వారిలో ఎవ్వరూ ఆయన పైకి అన్నదానితో ఏకీభవించలేదు. వ్యతిరేక అభిప్రాయాల్ని వెలిబుచ్చారు. అప్పుడాయన గొంతెత్తి సరికొత్త ఎన్నికల గురించి మాట్లాడారు. మెజారిటీ లేనివాళ్లకు మళ్లీ ఎన్నికలేమిటి? ధారుణంగా మాట్లాడకు అని 'ఢిల్లీ' అయినా వారించింది. అంతేకాకుండా, రాజమాతపార్టీ వాయుకుల్ని పిలిచి ప్రభుత్వాన్ని అప్పజెప్పవలసింది అనే అధికార వార్తను గవర్నరుగారికి పంపించింది. మిశ్రాగారి ఆశలన్నీ కూలిపోయాయి. మిశ్రాగారు ముఖ్యమంత్రి పదవినే కాకుండా వారి గర్వాన్ని కూడా విడిచిపెట్టుకున్నారు. వెంటనే రాజీనామా సమర్పించారు. యునయిటెడ్ అరబ్ రిపబ్లిక్ 'నాసర్'కిలాగా, తన రాజీనామాను కూడా 'తన పార్టీ' ఆమోదించదు అనే నమ్మకం ఆయనకు లేకపోలేదు. కాంగ్రెసు సభ్యులందరూ రాజీనామా యిస్తారు, దానివల్ల బోలెడంత రాద్ధాంతం జరుగుతుంది అన్నట్టుగా పత్రికలకు తెలియజెప్పారు. ఇది పని చేయలేదు. దానికీ కారణం ఉంది. మళ్లీ కొత్తగా టిక్కట్టిచ్చి ఓటుపెట్టి, నిలబెట్టినా నిలబడలేక పడిపోయేవారు అందులో ఎంతోమంది ఉన్నారు!

రాజమాత నేసిన ఒకే వొక్క రాయితో ఎన్నో పక్షులు చచ్చిపోయాయి! మిశ్రాగారి నుంచి అధికారాన్ని అధీనంలోకి తీసుకున్నారామె. మిశ్రాగార్ని అల్పుల్ని చేయడంతో పాటు శ్రీమతి గాంధీని కూడా అల్పంగా తయారు చేశారామె. మధ్యలో ఎన్నికలు నిర్వహించడం అంత సులభం కాదులే, అని శ్రీమతి గాంధీగార్కి కామరాజగారు సూచించారు!

* * *

ప్రాంతీయ భాషా విధానం మంచి ఫలితాలనిస్తుందని కేంద్ర విద్యామంత్రి శ్రీ టి. సేన్‌గారు వరసగా ఉపన్యాసాలు దంచు


1967 స్వాతంత్ర్యదినోత్సవం నాడు దేశ పరిస్థితి
ఆర్థిక రంగంలో ఘెరావ్‌లు
అధిక పన్నులు
రాజకీయ రంగంలో అవకతవకలు
అసహాయ స్థితిలో ఉన్న ప్రణాళిక
నాలుగో ప్రణాళిక
హృదయంలో మార్పేమీ లేదు
మంచి వర్షం వల్ల ప్రయోజనాలు
దేశంలో పరిస్థితుల్ని మరింతగా రెచ్చగొడుతున్న శత్రువులు
పెట్టే మంచి వర్షం కోసం
యింకా మేము ఎదురు చూస్తున్నాము

తున్నారు. ప్రాంతీయ భాషావిధానం ఎలా వుంటుంది? అనే విషయం అవగతం కావడానికి జనసంఘం ఒక పెద్ద ఆందోళన జరిపింది. ఉత్తర హిందుస్థానంలో మహమ్మదీయుల సంస్కృతి ఎంత ప్రబలమయినదో అందరికీ తెలిసిందే కదా! పంజాబును మూడు భాగాలుగా చేసి; ఉత్తర ప్రదేశ్‌లోను, ఢిల్లీలోను ఉర్దూకు స్థానమివ్వడానికి వెనకాడుతూ వున్నారు! ఒక విధంగా చెప్పాలంటే, చదివితే హిందీని చదవండి లేదా భారతదేశాన్ని విడిచిపోండి అని ముసల్మా

# న్యూఢిల్లీ లేఖ

నులకు చెబుతున్నారన్నమాట! ఈ పరిస్థితిలో మహమ్మదీయులంతా ఏకమై మాకు 'ఉర్దూసుభా' కావాలి. అని ఆందోళన లేవదీయడానికి ఆస్కారం ఉంది.

మహమ్మదాలీ జిన్నాగారి ఛాయలు లక్నో మీద వ్యాపించి వున్నాయి. భారతదేశానికి హిందూదేశమనే పేరుండనివ్వండి లేదా మరో పేరేదైనా వుండనివ్వండి. దేశంలో అధికారం పక్షాత్తం హిందువుల చేతిలో వుండడం ఖాయమన్న సత్యాన్ని గ్రహించిన జిన్నాగారు పాకిస్థాన్ కోసం ఆందోళన లేవదీశారు. మహాత్మాగాంధీగారు గాని, పండిట్ నెహ్రూగారుగాని కనిన కల ఒకటే ఒకటి అది, భారతదేశాన్ని ఎల్లప్పుడూ కాంగ్రెసు పార్టీయే రాజ్యం చేయాలి అనేది. మహాత్మా గాంధీగారి కాలంలో కూడా డా. మూన్‌జీ, డా. యస్. పి. ముఖర్జీగారలు ఉన్నారు మరి!

ఉత్తర హిందుస్థానంలోని హిందువుల మీద, ముఖ్యంగా ఉత్తర ప్రదేశ్‌మీద ఒక విచారకరమైన వ్యాఖ్యానం ఉంది. అదేమిటంటే, భారతదేశాన్ని 1947లో విభజించారు, 1966లో పంజాబును విడదీశారు— ఇదీ ఆ వ్యాఖ్యానం. శిక్కులంతా కలిసి ఎంతోమంది వుండరు. అలాంటి వాళ్లు పంజాబీ సుభా కోసం పోరాడి, ముసల్మానుల చేత 'ఉర్దూసుభా' ఆందోళన లేవదీయించడానికి మార్గం ఏర్పరచి వుంచారు. జనసంఘం తప్పితే తక్కిన పార్టీలన్నీ ముసల్మానులకి ప్రోత్సాహమివ్వటంలో ఆశ్చర్యం వుండదు. ఎందుకంటే, ఉర్దూ - వారి సంస్కృతికి చిహ్నమయినదీ, మతంలోని భాగమూ గనక!

శ్రీ ఎ. డి. గోర్వాలా అనే ఆయన బొంబాయి నుంచి 'ఒపీనియన్' అనే పత్రికని నడుపుతున్నారు. అందులో ఒక ముఖ్యమయిన వ్యాసంలో ఇలా వుంది:

'15 ఏళ్ల చరిత్రను తిరగేయండి. విద్యావంతులయిన పురుషులందరూ వారి రాష్ట్రాలకు అతుక్కుపోయి వున్నారు. వాళ్లకు బయటి ప్రపంచంలో అవకాశాలు తక్కువ. సంస్కృతిలోగాని, సభ్యతలోగాని ఒకరాష్ట్రం మరొక రాష్ట్రానికి విదేశమైపోయింది. అటువంటి పరిస్థితుల్లో రాజకీయ సంఘీభావం బ్రతుకుతుందా? భారతదేశం ఛిన్నాభిన్నంగా తయారయింది. ఇప్పుడుకూడా మనదేశం విదేశాలకు సులభసాధ్యంగా 'ఎర' అవడానికి ఆస్కారం ఎంతయినా వుంది. వారికి దేశాన్ని ఎలా దోచుకోవాలో బాగా తెలుసు 'ఎక్స్' రాష్ట్రంతో కలియడం, 'వయ్' రాష్ట్రాన్ని అర్థించడం, 'జడ్' రాష్ట్రాన్ని కొల్లగొట్టడం. ఇదివరకు అటువంటి పతనావస్థకు మరోసారి విద్యామంత్రిగారు బీజాలు నాటుతున్నారు. ఒక జాతీయభాష అంటూ లేని దేశంలో కలిసి పనిచేయడం ఎలా కుదురుతుంది? పరిపాలించడం ఎలా సాధ్యపడుతుంది?— ఈ వరసన సాగింది ఆ వ్యాసం.

ఈ వివరాలు సరిపోకపోతే ఇంకొకటి కూడా కలుపుకోవచ్చు. జాత్యభిమానం లేనివారు ఎవరూవుండరు నిష్పాక్షికంగా వ్యవహరించేవారు ఉండరనికాదు ఉంటారు. కాని, బహు కొద్దిమంది. అటువంటివార్ని ఏరి, నియోగించడం సాధ్యపడే విషయం కాదు. 15 భాషల్లోను ఉద్యోగాలకు పోటీ పరీక్షలు నిర్వహించినప్పుడు పరిణామం ఎలా వుంటుంది? ఒక్కో భాష తరఫున కొందరు కొందరు దేశం మొత్తంమీద ఎన్నికవుతారు కొన్ని ఉద్యోగాలు బెంగాలీవారికి, మరికొన్ని అరవలకి, కొన్ని తెలుగువారికి— ఇలా పంచిపెడతారు! దేశాన్ని పటుతరం చేయడానికి ఇలాంటి విధానం ఎంతవరకు సహాయం చేస్తుంది? రాష్ట్రభాష తప్పితే మరొక భాష ఎరగనివాడు వచ్చి, పరాయిరాష్ట్రంలో ఏం సేవ చేయగల్గుతాడు?

ఈ రోజుల్లో ఎవరూ పూర్తిగా ఏ పనీ ఆలోచించి చేయడంలేదన్న సత్యం ఇటువంటి విషయాలవల్ల మనకు ద్యోతకమవుతూ వుంది. ●

## పాఠకులకి మనవి

పాఠకులందరికీ స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంగా మా శుభాకాంక్షలు. స్థలాభావంచేత ఈవారం అధ్యక్షుని మరణం, మరికొన్ని మామూలు శీర్షికలను ప్రచురించలేకపోతున్నాము.

—సం॥

# బిన్నీవారి
# వానిటీ

·SANFORIZED·

## ముద్దులొచ్చే 20 రకాలు
## మిమ్ములను ఆకర్షిస్తాయి!

అందాలు చిలికే 20 ఛాయలు మీరు ఎన్నుకోడానికి, ఇదేబట్ట కావాలని మీరు ఎంతో కాలంనుంచీ అనుకుంటున్నారు! ఇప్పుడు దావిషేరు...వానిటీ-బిన్నీవారి సున్నితమైన పాప్లిన్ బట్ట.

**బిన్నీ – బట్టలకు పెట్టినది పేరు**




ఈ సైను బోర్డును ప్రదర్శించే బిన్నీ స్టాకిష్టుల వద మీకు కావలసిన బిన్నీ బట్టలు కొనండి.

బెంగళూరు ఉల్లెన్, కాటన్ & సిల్క్ మిల్స్ కంపెని లిమిటెడ్, అగ్రహారం రోడ్డు, బెంగళూరు-23.
బిన్నీ & కో లిమిటెడ్, మద్రాసువారి అంగసంస్థ.

bm-4176




'వాడి పేరేమో, ఈ రిజర్వ్‌డ్‌లిస్టులో ఉంది కాని వాడు మాత్రం కనిపించటం లేదురా!' బెజవాడ స్టేషన్లో దామోదరావు రామలింగంతో అన్నాడు, కొంచెం ఆశ్చర్యపోతూ.

'ఆ అబ్బాయి మీ ఫ్రెండా? రాత్రి ఒకసారి లేచి వెళ్ళాడు. మళ్ళీ కనిపించలేదు. ఇక్కడే ఎక్కడేవా ఉన్నాడనుకున్నాను. అదిగో అతని సామానుకూడా అక్కడే ఉందే!' అన్నాడు సామాను దింపించి కూలిని కుదుర్చుకుంటున్న ఒక నడివయస్సు మనిషి.

'అలాగండీ! హారే దామోదరం రిపోర్టిద్దాం రారా!—' రామలింగం, దామోదరం తమతో మాట్లాడిన వ్యక్తితో స్టేషన్ మాష్టరు ఆఫీసు వయిపు నడిచి వెళ్ళారు. 'అతను మా ఫ్రెండండి. మెడ్రాసులో చదువుకుంటున్నాడు, ఇంజనీరింగ్ కాలేజిలో. సెలవులకి ఇంటికెడుతూ ఇక్కడ రెండ్రోజులుండి పోదామనుకున్నాడు. ఏమిటో...'

* * *

పెద్ద బ్రేకుల చప్పుడుతో రయిలు బండి నెమ్మదిగా ఆగింది. తలుపుదగ్గరే మంచునిఉన్న సూరి కిందకి దిగాడు. అప్పటికి మధ్య రాత్రి దాటింది. బాగా వెన్నెల కాస్తోంది. ముందు పెట్టెల కొన్నిటి దీపాలు పసుపుపచ్చగా వెలుగుతున్నాయి. దూరంగా ఇంజన్ బుస వినిపిస్తోంది. వెన్నెలలో ఆవిరి, పొగస్పష్టంగా కనిపిస్తున్నాయి. బండి ఆగటంతో కొందరు ప్రయాణికులు దిగుతున్నారు. అసలు ఎందుకు ఆగిందో సూరికి అర్థంకాలేదు. అది పెద్ద బయలు ప్రదేశం. ముందు స్టేషన్‌కాని సిగ్నల్‌కాని కనిపించటంలేదు ఎవరో పొరపాటున గొలుసు లాగిఉంటారని ఊహించాడు సూరి. తనది ఆఖరిపెట్టె. రయిలు బండి చిట్టచివర నుంచుంటే ఎలా ఉంటుందో, అనిపించింది సూరికి హటాత్తుగా. పెట్టె వెనక వయపుకి నడిచి వెళ్ళాడు. అనాలోచితంగా మరి కొంత దూరం పట్టాల వెంబడే నడిచి వెళ్ళాడు. వెనక్కి తిరిగిచూశాడు. దూరంగా ఏవో మాటలు, ఇంజన్ బుసలు సన్నగా వినిపిస్తున్నాయి. బండి గభాలున బయలుదేరి వెళ్ళిపోతే తను ఈ చోట వంటరిగా ఉండిపోతాడు! ఈ ఊహకి సూరి నవ్వుకున్నాడు. చుట్టూ కలయచూశాడు. అది చాలా చదును ప్రదేశంగా కనిపించింది. పాల వెన్నెలలో తెల్లగా మెరుస్తోంది.

అక్కడక్కడ చెట్లు నల్లటి పొదల లాగ కనిపిస్తున్నాయి. పరధ్యాన్నంగా మళ్ళీ ముందుకి సాగిపోయాడు సూరి. మూడు నాలుగు అడుగులు వేశాడోలేదో కాలు బద్దీలో ఇరుక్కుని బోర్లా పడ్డాడు. ఏదో నుదుటికి గట్టిగా కలిగింది...

* * *

సూరికి స్పృహ వచ్చేసరికి ఒక క్షణం తను రయిలుపెట్టెలో ఉండటానికి బదులు కంకర్రాళ్ళ మీద చెంప ఆనించి ఎందుకు పడుకున్నాడో అర్థంకాలేదు. కాని వెంటనే జరిగినదంతా జ్ఞాపకం వచ్చింది. గాభరాగా లేచి చూశాడు. రయిలుబండి కనిపించలేదు. కంగారుగా కొన్ని గజాలు ముందుకి పరిగెత్తాడు. తర్వాత కోలుకుని చేతిగడియారం చూసుకున్నాడు. రెండుగంట కావస్తోంది. అంటే, తను ఇక్కడ అరగంట, ముప్పావుగంటకి పయిన స్పృహ తప్పి పడి ఉన్నాడన్నమాట! నుదురు తడిమి చూసుకున్నాడు. పెద్ద బొప్పి కట్టింది. మొదటి కొద్ది క్షణాలలో తను గమనించలేదు కాని తల భారంగా పోటుగా ఉంది. పెద్దగాయం తగలలేదు కాని తనిప్పుడు ఏమిచెయ్యాలి?

'ఉత్తినే కంగారుపడి లాభం లేదోయ్!' అని తనలో తనే చెప్పుకున్నాడు. రుమాలు బయటికి తీసి మొహం అంతా శుభ్రంగా తుడుచుకున్నాడు.

—చుట్టుపక్కలేమయినా ఊరు ఉంటే ముందుకు అక్కడికి పోవటం మంచిది!—వలుదిక్కులా చూశాడు. ఒక వయిపు సన్నగా, నీలంగా ఏదో కాంతి కనిపిస్తోంది. గ్రామంలో గాస్‌లయిటు వెలిగించి ఉంటారు, అనుకుని అటు బయలుదేరాడు. వెన్నెలలో దారి సులభంగానే కనిపిస్తోంది. జోరుగా వీస్తున్న గాలి తల భారం మరపింప చేసేట్లుంది.

దగ్గిరికి వెళ్ళేకొద్దీ వెలుగు అధికం అవుతోంది. వెలుగుతోబాటే ఏదో ఒక శబ్దం కూడా వినిపిస్తోంది. పెద్ద మోటారు పని చేస్తూంటే వచ్చే మోతలాగా ఉంది. అంతా దట్టంగా ఎదిగిన చెట్ల సమూహం వెనక నుంచి వస్తున్నట్లుంది

— ఊరేమీ కనిపించటం లేదేమిటీ!— అనుకుంటూ సూరి నడక వేగం హెచ్చించాడు. నాలుగయిదు నిముషాల్లో చెట్లగుంపుని ప్రవేశించాడు. అక్కడ కనిపించిన దృశ్యం చూసి అదిరిపడ్డాడు.

● ● ●

చెట్ల గుంపు అవతల చిన్న బయలు ప్రదేశం వొకటి ఉంది. దాని మధ్య సుమారు డెబ్బయి, ఎనభయి అడుగుల వెడల్పు ఉన్న పెద్ద పళ్ళెంలాంటి వస్తువు ఒకటి ఉంది. ఏదో వెండిని పోలిన లోహంతో చేసి ఉండేవో వెన్నెల కాంతిలో, దాని మధ్యనే ఉన్న గాజు గోపురం లాంటి నిర్మాణంలో నుంచి వస్తున్న నీలం వెలుగులో విచిత్రంగా మెరుస్తోంది. దాని అంతర్గర్భంలో నుంచి వస్తున్నట్లుంది ఏవో తుమ్మెదల ఝుంకారం పోలిన శబ్దం. ఆ శబ్దానికి నేలకూడా అదురుతున్నట్లు ఉంది. సూరి తలంతా దిమ్మెక్కిపోయి నట్లుంది.

పళ్ళేనికి సూరి నుంచున్న వయిపువే రెండుమూడు ఆకారాలు నేలమీ కదులుతున్నాయి, చూడటానికి మనిషి ఆకారాల లాగే ఉన్నాయి. కాని, విచిత్రమయిన కవచాలేవో తొడుక్కున్నట్లనిపించింది సూరికి. వీటివల్లనేనేమో బొమ్మలలాగ పట్టిపట్టి కదులుతున్నట్లున్నాయి.

సూరికి భయం వేసింది. దర్లగా అక్కడినుంచి జారుకుందా మనుకున్నాడు. వెనక్కి తిరిగి ఒక్క అడుగు వేశాడో లేదో కాలికి ఏదో కొమ్మ అడ్డుతగిలి గభాలున కిందపడ్డాడు. హడావుడిగా లేచేసరికి తన చుట్టూ నాలుగు ఆకారాలునుంచుని ఉన్నాయి. మరుక్షణం ఒక ఆకారం అతని మీదకి టార్చివంటి దీపం ఒకటి వేసింది. సూరికి నోటమాట రాలేదు. అలాగే నుంచుని ఉండిపోయాడు. కొంత కాలం గడిచింది. అది ఒక నిముషానికి తక్కువే ఉన్నా ఒక యుగంలాగ తోచింది సూరికి. తర్వాత ఒక ఆకారం అతన్ని తమ యంత్రం వంక నడవ మన్నట్లుగా సంజ్ఞ చెయ్యటం గమనించి అటు కదిలాడు.

అయిదు నిముషాల తర్వాత సూరి వలయాకారం కల చిన్న గదిలో కూర్చుని ఉన్నాడు. 'గోడ' చుట్టూ కూర్చునేందుకు మెత్తటి ఆసనం వేసిఉంది—తలుపు దగ్గర [illegible] గాజువంటి [illegible]తో చేసి ఉంది. లోపలవిప్పు కాంతి చాలా లేత నీలపురంగు కలిగి ఉంది. తన ఎదురుగా ఒక 'వ్యక్తి' కూర్చుని ఉన్నాడు. అతని పక్కనే మరొక 'వ్యక్తి' నుంచుని ఉన్నాడు. ఇద్దరూ మానవకారం కలిగే ఉన్నట్లు కనిపిస్తున్నారు కాని 'చర్మం' మాత్రం పసుపురంగులోనూ, 'కళ్ళు' పిల్లికళ్ళ రంగులోనూ, 'జుట్టు' ముదురు ఊదా రంగులోనూ ఉన్నాయి. పెదిమలు ఏ మాత్రం కనిపించనంత సన్నగా ఉన్నాయి. 'ముక్కు'కి ఒక ద్వారమే ఉన్నట్లుంది.

నుంచున్న వ్యక్తి తడుముకుంటూ నెమ్మదిగా మాట్లాడటం ప్రారంభించాడు. 'నువ్వు ఇక్కడికి ఎలా వచ్చావు? నీతో ఎంతమంది ఉన్నారు?' భాష ఇంగ్లీషు! అతని కంఠం స్వరం బాగా కీచుగా ఉంది.

'నేనొక్కడినే దారితప్పి ఇలా వచ్చాను' అన్నాడు సూరి కూడా నెమ్మదిగా. ప్రశ్నలు వేసిన వ్యక్తి కూర్చున్న వ్యక్తితో ఏదో



# దూరప్రయాణం

చెప్పాడు. అతను మళ్ళీ ఏదో అన్నాడు.

'మేము 'డక్కా ఎ' అనే గ్రహం నుంచి వస్తున్నాము. దారిలో మా విమానం చెడిపోయి ఇక్కడ ఆగాము. కొంత కాలంగా మీ గ్రహం మా పరిశీలనకింద ఉన్నది. మా శాస్త్రజ్ఞులు మీ భాషలని కొన్నిటిని యంత్రాల ద్వారా అనుశీలించి నేర్చుకున్నారు. ఇక్కడి జీవులతో సాన్నిహిత్యం మా ఆరోగ్యానికి ప్రమాదకరమని, వాతావరణమే మా ఊపిరి తిత్తులకి మంచిది కాదని మా శాస్త్రజ్ఞుల అభిప్రాయము మీ లోకంతో వారివలె తెలియని వాటిని ధ్వంసం చెయ్యటానికి ప్రయత్నించే అలవాటు మాకులేదు. మీ కాల పరిమాణంలో చెప్పాలంటే మరో గంటలో ఈ చోటుని వదిలి వెళ్ళిపోబోతున్నాము. నిన్ను మాతో బాటే తీసుకు పోవటానికి నిశ్చయించుకున్నాము -'

'వీహాతోవా! నేను సెలవుకి బెజవాడ మీదుగా మా ఇంటికి పోతున్నాను! ఇదేమిటి అన్యాయం? నన్ను దింపెయ్యండి-?' అని అతనిమాటకి అడ్డువచ్చాడు మూర్తి.

* * *

'చెయ్యవలసినదంతా చేస్తూనే ఉన్నాము కాని పేపర్లో కూడా ఒక ప్రకటనవేస్తే బాగుంటుంది. ఫోటో కూడా వేస్తే సరి!' అన్నాడు పోలీసు అధికారి. 'ఒకవేళ ప్రమాదవశాత్తు బండిలోనుంచి పడిపోతే ఈపాటికి తెలిసే ఉండేది. ఈదారిమీద చాలా బళ్ళు వెళ్ళి వస్తూ ఉంటాయి. మతి మరుపువచ్చి ఏ స్టేషన్లోనయినా దిగి వెళ్ళిపోతే చాలా కష్టం!'

* * *

'నువ్వు అభ్యంతరం చెప్పి ప్రయోజనం లేదు. మాతో వచ్చి తీరవలసిందే! కారణం నీకు చెప్పనవసరం లేకపోయినా చెప్తున్నాను విను: ఆ విధంగానయినా ఎదురు చెప్పకుండా చెప్పినట్లు చేస్తావేమో! మేము మా గ్రహం నుంచి ఈ నక్షత్రమండలం లోనే ఉన్న మరొక గ్రహానికి వెడుతున్నాము. దారిలో దిగటంకాని, అనుమతి లేనిదే ఏ గోళంమీది జీవులతో సాన్నిహిత్యం కాని వీలులేదని మా ప్రభుత్వంవారు శాసించారు. ఇప్పుడు అనుకోకుండా నువ్వు మాకు తగిలావు. మేము వెళ్ళే గ్రహంలో మా అధికారులకి జరిగినదంతా చెప్పి వారి అజ్ఞానుసారం నడుచుకోవలసి వస్తుంది...' అన్నాడు 'డక్కా ఎ' నుంచి వచ్చిన వ్యక్తి.

మూర్తికి ఏమనాలో తెలీలేదు. ఒకటి రెండు క్షణాలు ఆలోచించి అమాంతంగా లేచి బయటికి పారిపోతే? కాని, తలుపు వేసి ఉంది!

'నువ్వు సరిగ్గా నడుచుకోనకపోయినట్లయితే నిన్ను నిర్బంధించవలసివస్తుంది. అనవసరంగా ఆ పరిస్థితి రానివ్వకు!' యాంత్రికంగా చెప్పాడు ఆ వ్యక్తి.

* * *

'వీడి అడవిలోనో దిగితే ఏ పులో, సింహమో పట్టుకుపోయిందేమో?' అన్నాడు దామోదరరావు రామలింగంతో.

'నీ మొహం, ఇక్కడ పులులూ సింహాలూ ఎక్కడరా! ఇదేదో పెద్ద విచిత్రంగానే ఉంది. పేపర్లో ఎడ్వర్టయిజ్మెంట్ వేశాము కదా! ఎవరో ఏదో చెప్పకుండా ఉంటారంటావా?'

* * *

ఆ విమానంలో పదిమంది ఉన్నారు. ఇంకా అయిదుమందికి సరిపోయే ఖాళీ, సౌకర్యాలు ఉన్నాయి. మూర్తి కూడా తక్కిన ప్రయాణీకులలాగే తన సీటు బెల్టు వేసుకుని కూర్చున్నాడు. విమానం లోపలి యంత్రాల మోత విపరీతంగా పెరిగింది. దాని కదలికలకి వళ్ళంతా అదిరిపోతున్నట్లనిపించింది అతనికి. కొన్ని నిముషాల తర్వాత విమానం పయికి లేచినట్లనిపించింది. అతి వేగంగా లేవటంవల్ల కొంత సేపు చాలా బాధపడ్డాడు. ఒక అరగంట గడిచింది. తర్వాత అక్కడికి తనతో మాట్లాడిన వ్యక్తి వచ్చాడు. అతనిపేరు 'హామా' అని మూర్తికి తెలిసింది. ఆ విమానం ముఖ్యాధికారి పేరు 'సెబు'ట. తక్కినవారి కొందరిపేర్లు హామా చెప్పాడు కాని కొత్తగా ఉండటంచేత అవి మూర్తికి తలకి ఎక్కనే లేదు.

'విమానం పూర్తిగా బాగుపడలేదు. మామూలు వేగంతో వెళ్ళలేకపోతున్నాము. అయినా, ఇటొచ్చి చూడు, మీ భూగోళం ఎంత స్పష్టంగా కనిపిస్తోందో!' అన్నాడు ఒక టెలివిషన్‌వంటి యంత్రం చూపిస్తూ.

'పెద్ద చంద్రగోళంలాగ ఉంది!' ఎన్ని బొమ్మలు, ఫోటోలు పత్రికలలో పడినవి చూసినా ఇంత కాంతితో వెలుగుతూ కనిపించిన భూగోళాన్ని చూసేవరికి మూర్తి

గొంతుకలో ఏదో ఇరుక్కున్నట్లయింది.

'అదిగో మా దేశం!' లేత నీలం, ఆకుపచ్చ, ఊదారంగులతో ముదురు నీలం కలిసి ఉన్న ఖండాల, సముద్రాల రేఖలతో భారతదేశ ఆకారం బడిలో చూపించే గోళాల నమూనాలలో కనిపించే ఆకారంలాగే ఉంది!

'మా ప్రపంచంలో వారూ త్వరలో చంద్రమండలానికి వెళ్ల బోతున్నారు తెలుసా?' అన్నాడు సూరి కొన్ని క్షణాల మౌనం తర్వాత.

'విన్నాను! మా గ్రహం చుట్టూ నాలుగు ఉపగ్రహాలు నిత్యమూ తిరుగుతూ ఉంటాయి. కొన్నివేల సంవత్సరాల క్రితమే వాటిలో మేము స్థావరాలు ఏర్పరుచుకున్నాము. మా అంతరిక్షయానం చాలా పురోగమించింది— మీవాళ్లు సాధించిన దానితో పోలిస్తే. ఈ విమానం గంటకి కొన్ని వేల కిలోమీటర్ల వేగంతో ఆకాశంలో వెళ్లగలదు, లేదా ప్రత్యేకమయిన ఏర్పాట్లతో కాలంలో కూడా ప్రయాణం చెయ్యగలదు. ఈ రకం గమనం గురించి మీ శాస్త్రజ్ఞులు కనిపెట్టి ఉంటారు.'

'అవును, అయిన్‌స్టెయిన్ అనే ఆయన దీనిని గురించి కొన్ని సిద్ధాంతాలని ప్రతిపాదించాడని చదివాను. నా చిన్నప్పుడు హెచ్. జి. వెల్స్ అనే బ్రిటిష్ రచయిత 'టయిమ్ మెషిన్' అనే పుస్తకం చదివాను. అందులో కాలంలో గమనం గురించి ఎంతో బాగా రాశాడు! మనం కూడా ఆ రకం ప్రయాణం చేస్తామా?' అని కుతూహలంతో అడిగాడు సూరి. ఇదంతా ఒక కలయేమో అనే అనుమానం సూచాయగా కలుగుతున్నా దానిని అణగ దొక్కి వేశాడు. తన మామూలు ప్రపంచం ఇప్పుడు ఎంతో దూరంగా అనిపిస్తోంది. డక్కాని గ్రహవాసులు వింతగా కనిపించటం లేదు. ఆకారంలో చిన్న భేదాలు, మాట తప్ప ఇంచుమించు మనుష్యులలాగే ఉన్నారు. హమా దగ్గర ఎన్నో కొత్త విషయాలు అడిగి తెలుసుకోవాలని ఆరాటంగా ఉంది సూరికి.

'విమానం పూర్తిగా బాగుపడలేదని చెప్పాను కదూ? లేకపోతే ఆకాశంలో బదులు కాలంలోకే మారి పోయేవాళ్లమే ... మీ సూర్యమండలంలో ఒక ఎర్రటి గోళం ఉంది. అక్కడ దిగి అవసరమయిన మరమ్మత్తులు చేసుకోవటానికి నిశ్చయించుకున్నాము. మా లోకానికి రేడియో సందేశం ఒకటి పంపాము. జవాబు రావటానికి ఒకటి రెండు రోజులు పట్టవచ్చు. మామూలు రేడియో ప్రసారాలు దానికి చాలవు వేగం మరీ తక్కువ! ప్రత్యేకమయిన కిరణ ప్రసారం వాడుకుంటాము...'

'మరి వేగం తగ్గి ప్రయాణ కాలం అధికం అయినప్పుడు ఆహారం, గాలి వంటి సౌకర్యాలకి ఇబ్బంది కాదా?' సూరికి హఠాత్తుగా అనుమానం కలిగింది.

'నవ్వొచ్చింది! నిజం చెప్పాలంటే ఇప్పటికే మన పరిస్థితి ఏమీ బాగాలేదు. కాని నేను చెప్పిన గ్రహం - దానిని ఇంగ్లీషులో మార్స్ అంటారనుకుంటాను — చేరేదాకా ఎలాగో అలా సర్దుకోవచ్చు. మీలాగే మేమూ ప్రాణవాయువు పీలుస్తాము. మా దేహ స్వభావం కూడా ఇంచుమించు అటువంటిదే కాని కృత్రిమ ఆహారాలకి అలవాటు పడ గలిగాము త్వరలో నీకూ రుచిచూపిస్తాము.'

సూరి ఏదో అనబోతూ ఉండగా వారి విమానం ఆమాంతం ఒక కుదుపు ఇచ్చింది. దాని వేగానికి తట్టుకోలేక సూరి పడ్డాడు. ఇంతలో వారున్నగదిలోని లవుడ్ స్పీకర్‌లో నుంచి శబ్దాలు కొన్ని, ఏవేవో మాటలు వినిపించాయి. గోడమీద చెయ్యిపెట్టి పడిపోకుండా నుంచున్న హమా మాత్రం దానిని వింటూ కంగారు పడుతున్నట్టు కనిపించాడు.

'సూరీ! త్వరగా లేచి నీ సీట్లో కూర్చో పరిస్థితి ప్రమాదంగా ఉందిట! X—! X X X— !!! ?' తత్తరపాటులో హమా తనభాషలోకి మారిపోయాడు.

* * *

'వెన్నెల చూడరా ఎంత బావుందో! పాపం, సూరి ఒకసారి వెన్నెలగురించి కవిత్వం రాస్తే వాడ్నెంత ఏడిపించాము! వాళ్లమ్మా, నాన్నతో చెప్పి ఇంజనీరింగ్ మాన్పించి లిటరేచరులో చేర్పిస్తామని అన్నాము గుర్తుందా?' వంతెన మీద నుంచుని పాదరసంలాగ మెరిసి పోతున్న నదిలోకి చూస్తూ అన్నాడు.

'వాడికసలు అంతరిక్ష యానమంటేనే పిచ్చి! ఎప్పటికయినా స్పేస్ ట్రావెల్ అంతర్జాతీయం అయితే అందులో కూలీ గయినా వెళ్లటానికి ప్రయత్నిస్తానని అంటూ ఉండేవాడు ... వాళ్లతాతయ్య మాత్రం మనిషి ధస్తే చంద్రలోకం చేరుకోవటాన్ని వాదిస్తాడు. మా తాతయ్య ఆర్బిటర్లు, లాన్చర్లు అంతా మోసం అంటాడు!...'

* * *

'అయితే ఇప్పుడేమి చేద్దాము?' అనడిగాడు సూరి మళ్ళీ. ఈ ప్రశ్న ఎన్నిసార్లు వేశాడో లెక్కలేదు. హమా సమాధానం ఇవ్వలేదు. ఇద్దరూ చిన్న టాంకు వంటి వాహనంలో చంద్రగోళం మీద ఒక లోయలో కూర్చుని ఉన్నారు. అప్పటికి చీకటిపడింది. కాని, ఆకాశంలో ఉజ్వలంగా వెలిగే భూమి 'వెన్నెల'లో ఇరువయిపులా ఉండే రాతికొండలు భయంకరంగా, అందంగా కనిపిస్తున్నాయి.

వారి విమానం చెడిపోవటంతో దాని అధికారి చోదకుడు, ఇంజనీరు—వీరిద్దరితో హమా అత్యవసరంగా సంప్రదించి దిగటానికి సౌకర్యంగా ఉన్న చంద్రగోళంమీద దింపటానికి నిశ్చయించుకున్నారు. కొంచెం కష్టంమీద విమానాన్ని చంద్రగోళంమీద దింపారు. మరమ్మత్తు సాగుతూ ఉండగా నెబు హమాకి, సూరికీ ఒకసారి బయటికి వెళ్లిరావటానికి అనుమతి ఇచ్చాడు. బయట తిరిగి రావటం కోసం చిన్న టాంకు వంటి బండి ఒకటి ఉంది. అది నిజానికి జెట్‌ల వల్ల నడిచే బండి. అవసరానికి టాంకులకి ఉండేటటు వంటి చక్రాలు, పట్టీలు కూడా ఉన్నాయి. భూమి మీద కాలానికి మమారు రెండు గంటలకి సరిపోయే వ్యవధి ఇచ్చి తిరిగి వచ్చెయ్యమన్నాడు కాప్టెన్ నెబు. చిన్న బండికీ విమానానికీ మధ్య రేడియో సౌకర్యం ఉంది.

సూరి, హమా జాగ్రత్తగా విమానం దిగిన ప్రదేశం చుట్టూ తిరగటం ప్రారంభించారు. ఎటు చూసినా చెట్టుచేమ లేని రాతి కొండలు. స్తంభించిపోయిన అగ్ని పర్వతాలు, ఊహకి అందనంత పూర్వకాలంలో చిత్రవిచిత్రంగా గడ్డకట్టుకు పోయిన శిలలలో కూడా ఇంత వింత ప్రకృతి స్వరూపం చూడలేదనుకున్నాడు సూరి.

'ఇంత కన్నా విచిత్రమయిన గోళాలు చూశాను. బురద సముద్రాలూ, జంతువులని తినే చెట్లూ, మన అంత ఉన్న పక్షులూ — ఒకటేమిటి!' అన్నాడు హమా సూరి తన ఆశ్చర్యాన్ని ప్రకటిం

దగా. 'ఒక గంట అయింది. ఇంకొక గంట ఉంది. మరమ్మత్తు ఎంతదాకా వచ్చిందో వెబుని అడుగుతాను!'

హమా తన భాషలో ఏదో అన్నాడు రేడియో మయిక్రోఫోన్‌లోకి. కొంత సంభాషణ జరిగింది. ఇంతలో అతని సాధారణ ధోరణి మారిపోయి ఒక చిన్న కేక వేశాడు. అతనితో కొంత పరిచయం కలిగిన సూరికి అతని ముఖంలో ఆశ్చర్యం, భయం ఆందోళన కనిపించాయి.

'ఏమయింది ?' అని అడిగాడు.

'అదే అర్థం కావడంలేదు ! వెబాతో మాట్లాడుతూనే ఉన్నాను. ఒక పెద్ద శబ్దం అయింది. ఆ తర్వాత పూర్తి నిశ్శబ్దం! ఎందుకయినా మంచిది వెనక్కి తిరిగి వెళ్లిపోదాం...'

బండిని వెనక్కి తిప్పారు. ఒక చిన్న లోయలో మలుపు తిరగగానే వారి కంటికొక భయంకర దృశ్యం కనిపించింది. వారి విమానం తునాతునకలయి పొగలు కక్కుతూ ఉంది. ఆ భీభత్సం మధ్య వారికి చాలా పెద్ద బండ వంటిది ఒకటి కనిపించింది.

'పెద్ద ఉల్క ఒకటి రాలి ఉంటుంది. ఎంత ప్రమాదం జరిగింది! కోటి కొక ఉల్కకూడా ఇలా ఇంతమందిని నేల విూద చంపి ఉండదు...' అంటూ మొదలు పెట్టిన హమా క్రమంగా తన భాషలోకి మారిపోయాడు. సూరికి కూడా ఎవరో ఆప్తులు పోయినట్లనిపించింది. జాగ్రత్తగా విమానాన్ని పరిశీలించారు. ఆ భీభత్సంలో వారికి ఏదీ మిగిలినట్లు కనిపించలేదు. ఇక తక్కినవారికోసం వెతికే లాభంలేదని నిశ్చయించాడు సూరి.

ఎంతసేపు అలా ఉండిపోయారో సూరికి తెలియలేదు కాని అప్పుడప్పుడు 'ఇప్పుడు ఏం చేద్దాము?' అని అడిగేవాడు. తన దుఃఖంలో మునిగి ఉన్న హమా అతన్ని ముందు అంతగా పట్టించుకోలేదు కాని చివరికి, 'వీలయినంత కాలం ఇలా ఇక్కడ ఉండిపోదాము; లేదా బయటికిపోయి ప్రాణాలు వదులుకుందాము...' అన్నాడు.

'అదేం మాట ? అంత తేలిగ్గా ఆశ వదులుకుంటే ఎలాగ ? ఇంత నిర్మానుష్య ప్రదేశంలోనూ ఎక్కడో మన బండిని దాచుకునే చోటు ఉండకపోదు. ఇక్కడే ఇలా

# దూరప్రయాణం

ఉంటే మనమీాదా ఒక రాయి పడవచ్చు కదా ?'

* * *

'చూశావా మనవాడు 'ఇన్టర్ ప్లానెటరీ ఎసోసియేషన్'లో చేరాట్ట! మనకి చెప్పనే లేదు!!' హాస్టల్లో సూరి రూమ్‌మేట్ శ్యామలరావు కార్డు ఒకటి చదివి దాన్ని రామలింగానికి అందచేస్తూ అన్నాడు.

'చంద్రుని కెక్కలేనమ్మ గగనానికెక్కుతుంది? ముందు 'మూన్ ట్రావెలర్స్ ఎసోసియేషన్' పెడితే సరిగ్గా ఉండేది!' అన్నాడు నాగరాజు.

'త్వరలోనే ఎప్పోల్లో ప్రాజెక్టుని అమెరికన్లు ప్రయోగిస్తారుట — అంతలోనే రష్యన్లు కాస్తా ఆ పని చేస్తారేమో!' శ్యామలరావు అన్నాడు.

'అప్పటికయినా మనవాడు దొరుకుతాడంటావా? సూరి వాళ్లమ్మ పాపం చాలా బెంగ పెట్టుకుంటోందిట...'

* * *

'ఆ గుహలోకి వెడదామా?' అని అడిగాడు సూరి. కొన్ని గంటలు తిరిగిన తర్వాత ఒక పెద్ద కొండలో గుహ ఒకటి కనిపించింది.

'ప్రాచీన మానవుడు గుహవాసి కదా! మన స్వభావం ఎక్కడికి పోతుంది?' హమా పరిహాసంగా మాట్లాడుతున్నాడని సూరికి తెలుసు.

జాగ్రత్తగా వాహనాన్ని గుహ వద్దకి



తీసుకుపోయాడు హమా. చాలా లోతుగా ఉన్నట్లుంది. అవతలి వయిపు గోడ కనిపించటం లేదు. హమా లైట్లు వేశాడు.

'ఇదేమిటి ! కలకంటున్నానా? నేను చూసేది నీకూ కనిపిస్తోందా!' సూరి కళ్లు నులుముకుంటూ అన్నాడు.

'కలకాదు నిజమే...'

గుహ సుమారు వంద అడుగుల లోపల బాగా వెడల్పయి లోపల మహామందిరం వంటి ప్రదేశం ఉంది. ఈ మందిరం పొడుగు కొన్ని వందల గజాలు, వెడల్పు కొన్ని వందల గజాలు, ఎత్తు కనీసం వంద గజాలు ఉంది. దీనంతటికీ మధ్య బోర్లించి ఉన్న బూర్లె మూకుడు వంటి పెద్ద 'గాజు' నిర్మాణం ఉంది. దాని పరిమాణాలు ఎత్తు సుమారు ఏభయి అడుగులు. వెడల్పు సుమారు మూడు, నాలుగు వందల అడుగులు ఉంది. స్పష్టమయిన గాజు లోపల ఏవో నిర్మాణాలు అస్పష్టంగా కనిపిస్తున్నాయి. అనుమానంగానే తమ బండిని గాజు మూకుడు దగ్గరికి తీసుకుపోయాడు హమా.

'లోపలికి వెళ్లేందుకు తలుపదిగో! లోపలి వస్తువేవో పవర్ హవుస్‌లాగ కనిపిస్తున్నాయే!!'

'ఇంత దూరం వచ్చిన తర్వాత ఇక సందేహించి లాభంలేదు. ఈ సూట్లు వేసుకుని బయటికి దిగి దానిలోపలికి వెళ్లటానికి ప్రయత్నిద్దాము రా!' అన్నాడు హమా, సూరి ఉత్సాహంగా అన్న మాటలకి సమాధానంగా.

పది నిముషాల లోపల ఇద్దరూ అంతరిక్ష వస్త్రాలు ధరించి గాజు నిర్మాణం తలుపు ముందు నుంచున్నారు. సూరి సంకోచం లేకుండా చెయ్యిజాపి తలుపు పిడిని పట్టుకులాగాడు. సునాయాసంగానే తలుపు తెరవగలిగాడు. ఇద్దరూ లోపలికి అడుగు వేశారు. అది చిన్నగదిలాగ ఉంది. ముందు మరొక తలుపు కనిపించింది.

'ఇది వాయు బంధం వంటిది. వెనక తలుపు మూసుకోనీ!' అన్నాడు హమా రేడియో ద్వారా. సూరి వెనక్కి తిరిగి చూశాడు. తలుపు మూసుకుంది. వెంటనే ఆ గది ఒక పీతం వెలుగుతో నిండిపోయింది. కొన్ని క్షణాలు గడిచాయి.

'ఇక్కడ గాలి ఉంది! ప్రాణవాయువు

ఉన్నట్లే మాపిస్తోంది ఈ విహాటక్! 'హామా తను అంతరిక్షవస్త్ర సామగ్రితో బాటే వచ్చే మీటర్ ఒకదానిని ముందు పట్టుకుని పరిశీలిస్తూ అన్నాడు. 'పీడనం కూడా సరిగ్గానే ఉంది!!'

సూరి తన తల కప్పు తీసివేశాడు. గాలిలో ఏదో రసాయనం వాసన ఉన్నప్పటికీ పీల్చటానికి సరిగ్గానే ఉన్నట్లుంది.

పదిహేను నిముషాల తర్వాత ఇద్దరూ లోపల ఒక చిత్రపటం ముందు నుంచు న్నారు. అది వారు నుంచున్న గాజు నిర్మా ణానికి సంబంధించినదేనని స్పష్టంగా తెలు స్తూనే ఉంది.

'ఈ భాష నాకు తెలుసు!' అన్నాడు సంతోషంగా హామా పటంలోని అక్షరాలని కొన్నిటిని చూసి. 'ఇది ఒకప్పుడు అంతరిక్ష యానంలో మా ప్రాంతంలో వివిధ గ్రహాల వాళ్లు వాడేవాళ్లు. తర్వాత ఇది ఒక గ్రహం వారిదని, అందరిమీదా రుద్దటం అన్యాయ మనీ కొందరు పోట్లాడారు! ఇది మా భాష కాదు కాని సాలాగ అంతరిక్షయానం తరుచుచేసే వారందరికీ ఏదో కొంత రాకుండా ఉండదు...'

*   *   *

'ఇలా చంద్రమండలం మీద — ఈసీ కొండ గర్భంలోపల!— కొన్ని వేలకి వేల ఏళ్ళముందు ఎవరో ఒక లోకంవారు ఎందుకో కట్టుకున్న ఈ భవనంలో మనం ఇలా అన్ని సౌకర్యాలూ అనుభవిస్తున్నామంటే నాకే నమ్మబుల్లు లేదు!' అన్నాడు సూరి. ఇద్దరూ లోపల ఒక గదిలో కూర్చుని ఒక వింత పానీయాన్ని తాగుతూ, వింత ఆహా రాన్ని తింటూ కూర్చున్నారు. ఆ భవనంలో వాతావరణం, ఆహారం, పానీయాలూ అన్నీ కృత్రిమంగా తయారయ్యేవే. హామా చెప్పిన దాని ప్రకారం అప్పటికి సుమారు ఏభయి వేల సంవత్సరాల క్రింతం చంద్రమండ లంలో ఒక గ్రహంవారు రహస్యంగా కట్టు కున్న స్థావరం అది. అక్కడ అణ్వస్త్రాలు కొన్ని దాచి ఉంచాలని వారి ఉద్దేశం. చివరికి వారి పథకం నెగ్గలేదు కాని స్థావరం రహస్యంగా అలాగే ఉండిపోయింది. అందులో ఉన్న కొందరూ క్రమేణా నశించి ఉంటారని హామా ఊహ. కాని, అసలు స్థావరం నిర్మాణం చాలా కట్టుదిట్టంగా ఉండటంవల్ల, లోపల స్థాపించిన యంత్రాలు చెక్కుచెదరకుండా పని చెయ్యటంవల్ల ఆ కృత్రిమ నగరం అలాగే ఉండిపోయింది. దాని నిర్వాహకులు సాంకేతికంగా ఊహించ లేనంతగా అభివృద్ధి చెందినవారయి ఉంటా రని సూరి గ్రహించాడు.

'అవును, కాని ఇలా ఈ గుహలో ఎంత కాలమని ఉండగలం?' హామా ప్రశ్నవేశాడు.

'గత్యంతరం లేదు కదా! లోపల వెతుకు దాము. రేడియో ప్రసారం వంటి దేదయినా వీలయితే సందేశాలు పంపిద్దాము. లే, హామా! పని మొదలుపెడుదాము రా...'

*   *   *

'హారే, దామోదరం! ఈ వార్త చూశావా? చంద్రమండలయానం అనుకున్న దానికంటే తొందరగా అవుతుందిట! ఆరు నెలల్లో మొదటి రాకెట్ బయల్దేరుతుం దిట!!' శ్యామలరావు ఒకరోజు అన్నాడు.

'అరె! అలాగా? మన సూరే కనక ఇక్క డిప్పుడుంటే ఎంత సంతోషించేవాడో కదా! వాళ్ల తాతయ్యతో కాసిన పది రూపాయల పందెం గెలుచునే కాలం దగ్గిరి కొచ్చిందన్నమాట...'

*   *   *

'ఈ యంత్ర పరికరాన్ని అర్థం చేసు కుని పని చేయించే సామర్థ్యం నాకు లేదు. ప్రయత్నిద్దాము కాని, కొన్ని సంవత్సరాలకి గాని ఏదీ తెలియదేమో ..' హామా అన్నాడు కొంచెం నిస్పృహతో.

'తప్పకుండా ప్రయత్నిద్దాము! పదిరి పెడ్తే ఎలా? రోజూ కావలసినంత ఆహారం ఎలా దొరుకుతుందో కనిపెట్ట గలిగాము. ఇక్కడి రేడియో ప్రసార యంత్రంతో వీలయినన్ని పరిశోధనలని జరుపుదాము...' లోపల సందేహంగానే ఉన్నా బయటికి ధైర్యంగా మాట్లాడాడు సూరి.

*   *   *

'ఐక్యరాజ్య సమితి, సెప్టెంబర్ 21: —అధ్యక్షుడు శ్రీ—ఈ రోజు ఐ. రా. స. సర్వసభ్య సమావేశంలో మాట్లాడుతూ పై వారం చంద్ర మండలంలో దిగిపోయే తమ అంతరిక్ష నావికులు తప్పకుండా అక్కడ ఉంటున్న శ్రీయుతులు హామా, సూరిలని కలుసుకోగలరని ఆశిస్తున్నా మన్నారు. భూమి, చంద్రమండలాల మధ్య రేడియో ప్రసార సౌకర్యం ఏర్పడింది కాబట్టి అంతరిక్ష నావికులకి ఇది చాలా సౌకర్యంగా ఉండగలదన్నారు. ఇంకా శ్రీ— ......'

—గ.



# ధర్మపథం. ఆత్మపరిశీలన.



బులుసు వెంకటరమణయ్య

కొంచెం నిదానించి ఆత్మపరిశీలన చేసుకొంటే, ఎట్టి దురహంకారిలోనయినా మార్పు కలుగుతుంది. క్రూరస్వభావం సున్నితంగా పరిణమిస్తుంది. వినాశకర ప్రవృత్తి నిర్మాణాత్మకంగా మారిపోతుంది. అత్యంత కఠినహృదయుడై ఇరవై ఒక్కసారి వెదకి వెదకి క్షత్రియకులాన్ని నశింపజేసిన అవతారమూర్తి పరశురాముడే ఆత్మపరిశీలన వల్ల విచిత్రంగా మారిపోయాడంటే ఇతరుల గురించి వేరే చెప్పడమెందుకు?

అవి శ్రీరాముడు వనవాసం చేస్తున్న రోజులు!

అతను పంచవటిదగ్గర ఒక పర్ణశాలను నిర్మించుకుని, లక్ష్మణుని సేవలను గ్రహిస్తూ సీతాదేవితో అక్కడ కాలం గడుపుతూ ఉన్నాడు.

ఒకనాడు అక్కడికి అనుకోకుండా పరశురాముడు రావడం తటస్థపడింది.

ఇద్దరికీ ఆశ్చర్యం కలిగింది.

తన ఆశ్రమానికివచ్చిన ఆ అతిథిని శ్రీరాముడు మిక్కిలి సమ్మానించి, ఆతిథ్యం యిచ్చాడు. లక్ష్మణుడు భార్గవరాముడికి సేవలు చేశాడు.

శ్రీరాముడు తనకంటె గొప్పబలవంతుడని, ధనుర్విద్యలో అహంకారం చూపిన తన్ను ఓడించాడని భార్గవరాముడికి బాగా గుర్తుంది. అలాంటి శ్రీరాముడు తనమీద ఎక్కువ గౌరవంతో మిక్కిలి వినయవిధేయతలతో తనకు ఆతిథ్యం యివ్వడంవల్ల పరశురాముడికి ఎంతో ఆనందమూ, సంతృప్తీ కలిగాయి.

అతను ఆ దినమంతా అక్కడే ఉండిపోయాడు.

సంధ్యాకృత్యాలు అన్నీ నిర్వహించిన తర్వాత శ్రీరాముడు పర్ణశాలకు చుట్టూ నాటిన మొక్కల కుదుళ్లు సరిచేసి, నీరు పోయసాగినాడు. పరశురాముడు ఆ ప్రక్కనే నుంచుని ఉన్నాడు.

ప్రసంగవశాన శ్రీరాముడు జామదగ్నితో 'స్వామీ! ఇప్పుడు తమరు ఆశ్రమంలో ఏ మహత్కార్యాన్ని నిర్వహిస్తున్నారు?' అని ప్రశ్నించాడు.

పరశురాముడు ఊరికే కూర్చోడని దాశరథికి తెలుసును. అందుచేతనే యిలా ప్రశ్నించడం జరిగింది.

పరశురాముడు 'నేను ఊరికే ఉండేవాడను కానని నీకూ తెలుసును. ఇప్పుడు నా ఆశ్రమ పరిసరాల్లోని అడవిని ఛేదించి, మైదానాలుగా మార్చి గ్రామనిర్మాణ కార్యక్రమానికి పూనుకున్నాను. ఇప్పుడు నా గండ్రగొడ్డలికి బాగా పని కలిగింది' అని అన్నాడు.

అన్నాడుగాని, శ్రీరాముడు ఏమి అంటాడో అని అనుమానం ఉండనే వుంది. 'చెట్లను పెంచడానికి బదులు వాటిని ఛేదించడం తమవంటివారికి తగునా?' అని అంటాడేమో అని పరశురాముని సందేహం! ఊహ కూడాను.

కాని, అతని ఊహకు వ్యతిరేకంగానే జరిగింది.

'మహామునీ! మీ సంకల్పం ప్రశస్తంగా ఉంది. జనుల నివాసానికి తగిన గ్రామాల నిర్మాణం కోసం మీరు అడవులను నరికివెయ్యడం చాలా మెచ్చుకోదగినది. ఇది జనసామాన్యానికి మహోపకారమయిన పని' అన్నాడు శ్రీరాముడు. ఇలా అంటూనే ఒక వాడిపోతున్న చిన్న మొక్కను దూరంనుంచే చూచి 'అయ్యో! పాపం! నీళ్లులేక ఆ మొక్క ఎలా వాడిపోయిందో?' అని వేగంగా పోయి దానికి నీళ్లుపోసి ఎంతో తృప్తిపడ్డాడు.

శ్రీరాముని మాటలకు పరశురాముడు తల వంచుకున్నాడు. అతడు చేసిన పనికి కుంగిపోయాడు.

శ్రీరాముడు తనకేదో గొప్ప ఉపదేశం చేసినట్లుగా అతనికి తోచింది.

మర్నాడు పరశురాముడు తన ఆశ్రమానికి వెళ్లిపోయాడు. వెళ్లి వెళ్లగానే ఆశ్రమవాసులను చూచి 'శ్రీరామచంద్రుడు నాకు గురువైనాడు; గొప్ప ఉపదేశం చేశాడు' అన్నాడు.

అతని మాటలకు అక్కడివారు ఆశ్చర్యపోయారు.

'ఇదివరలో విలువిద్యలో నన్ను ఓడించి, నా గర్వాన్ని అణచివేసినాడు. నా కోపాన్ని చంపివేశాడు. ఇప్పుడు మాటలతో కాకుండా తన ప్రవర్తనవల్లనూ, క్రియలవల్లనూ నా ఆత్మ పరిశీలనకు గొప్ప అవకాశం యిచ్చాడు. ఇప్పుడు నా బుద్ధి పూర్తిగా మారిపోయింది' అని పర్ణశాల దగ్గరి సంఘటనలు, శ్రీరాముని పలుకులు వివరంగా చెప్పాడు.

పరశురాముని అభిప్రాయం అక్కడివారికి తెలియలేదు. తర్వాత ఆయనే ఇలా అన్నాడు— 'నేను నన్ను పరిశీలించుకున్నాను. నా తప్పులు నాకు బాగా తెలిశాయి. ఇక మీదట మనం

(64వ పేజీ చూడండి)

శ్రీమతి పరిమళా సోమేశ్వర్

# పిల్లల ప్రవర్తన - తల్లి బాధ్యత

పిల్లల అలవాట్లు, వాళ్ల మనస్తత్వం కూడా వారి చుట్టూ ఉన్న వ్యక్తుల మీద, పరిసరాలమీద ఎంతో ఆధారపడి ఉంటాయన్న సంగతి అందరికీ తెలిసినదే. ఈ వ్యక్తులందరిలోకీ తల్లి ప్రభావం చాలా ఎక్కువగా ఉంటుంది. తల్లి గర్భంలో నవ మాసాలు పెరిగి, తల్లి రక్తాన్ని, ఆరోగ్యాన్ని పంచుకు పుట్టి, తల్లిపాలు త్రాగి పెరిగిన బిడ్డమీద మాతృ మమకారం యొక్క ప్రభావం ఉండటంలో ఆశ్చర్యం లేదు. మగపిల్లలు కాని, ఆడపిల్లలుకాని తల్లిని ప్రేమించినంతగా ఆఖరికి తండ్రిని కూడా ప్రేమించలేరు! దీనికి కారణం వారి పుట్టుకేకాక చిన్నతనం నుండి ఉగ్గుపాలు పోసి, స్నానం చేయించి, జాబిల్లి చూపిస్తూ గోరు ముద్దలు తినిపించి, చేతులుపట్టుకుని తప్పటడుగులు వేయించి అతనికిష్టమైన ఒట్టలు తొడిగి బడికి పంపే తల్లిమీద గల ప్రేమ వయసు పెరుగుతున్న కొలదీ వారి నరనరాల్లోనూ జీర్ణించుకుపోవటమే దానికి కారణం.

ఈ మమకారాన్ని ఆధారంగా తీసుకుని ఆధునిక గృహిణి తన బిడ్డల సంస్కారాన్ని, నైతిక జీవితాన్ని తీర్చి దిద్దటానికి ఎంతైనా అవకాశం ఉంది. పిల్లలు మొదట్లో తల్లిదండ్రుల ఆదుపాజ్ఞల్లో ఉన్నా కాస్తవయసొచ్చిన దగ్గర నుండి సహజంగా వారిలో ఉండే వ్యక్తిత్వం వల్లనైతే నేమి, స్నేహితుల ప్రభావం వల్లనైతేనేం యింట్లోని వారితో మానసికంగా బంధాలు తెంచుకుని తమకిష్టమైన పంథాలోనే బ్రతుకుతుంటారు. ఇలాటి వయసులో ఉన్న పిల్లల మనస్తత్వానికి పునాదులు చిన్నతనంలో తల్లివలన నేర్చిన సంస్కారమే. పునాదులు గట్టిగా ఉన్నట్లయితే ఆపైన నిర్మించే కట్టడం కూడా గట్టిగా ఉంటుంది. అలాగే పిల్లలు చిన్నతనంలో నేర్చిన సంస్కారం గొప్పదైతే పెద్దయినాక కూడా వారు ఉన్నత సంస్కారులవగలరు.

ఐతే తన బిడ్డలు పెరిగి పెద్దయినాక ఆదర్శప్రాయులుగా తయారవాలంటే తల్లి నిర్వర్తించవలసిన కర్తవ్యం ఏమిటి? మొట్టమొదట తల్లిబిడ్డల దృష్టిలో ఒక ఉన్నతమైన స్థానాన్ని కల్పించుకోవాలి. దానికి ఆమెలో సహజంగా ఉండే ఔన్నత్యం ఒక్కటే చాలదు. ఆమె చుట్టూ ఉన్న మనుష్యులు ఆమె వ్యక్తిత్వాన్ని కించపరచ కుండా చూడాలి. ముఖ్యంగా మధ్య తరగతి ఉమ్మడికుటుంబాల్లో ముసలివాళ్లే అజమాయిషీ చెలాయిస్తూంటారు యితరుల వ్యక్తిత్వాలను గుర్తించకుండా. అలాటప్పుడు తాత, బామ్మల అనుగ్రహం క్రింద బ్రతుకుతున్న తల్లిమీద జాలిపడతారు కాని, గౌరవించలేరు కాస్త జ్ఞానం వచ్చిన పిల్లలు. అలాగే భర్త కూడా పిల్లల యెదుట భార్యని తిట్టటంకాని, ఏ రకంగానూ అవమానించటం కూడదు. ఏ విషయం గురించైనా భేదాభిప్రాయాలు వచ్చినప్పుడు పిల్లలు సమీపంలో లేనిది చూసుకుని పరిష్కారం చేసుకోవాలి.

ఇలా పిల్లల దృష్టిలో ఒక ప్రత్యేక స్థానాన్ని ఆక్రమించుకున్న తరువాత వాళ్లని అదుపులో పెట్టటం చాలా సులభం తల్లికి. మొట్టమొదటగా తల్లి తన పిల్లలు అశ్లీలాలు మాట్లాడకుండా జాగ్రత్త పడాలి. ఎంత కోపంలో ఉన్నా సరే ఆమె పిల్లలను అసభ్యమైన భాషలో తిట్టకూడదు. 'అనుకరణ' పిల్లల సహజలక్షణం. తల్లి తిట్టినప్పుడు మొదట యేడ్చినా ఆ తరువాత ఆ తిట్లన్నీ జాగ్రత్తగా గుర్తుంచుకొని వాటిని యితరుల మీద ప్రయోగించటమో లేదా తు. చ. తప్పకుండా తిరిగి తల్లికే అప్పచెప్పటమో చేస్తారు. చిన్నతనంలో పెద్దలు చేసిన యిలా చిన్న పొరపాటువల్లనే మనం విద్యాధికులైన పురుషులు కూడా చాలా మంది కాస్త కోపం వచ్చిందంటే చాలు 'పంచాంగం' విప్పటం చూస్తుంటాం. కాబట్టి యీ విషయంలో తల్లికే కాక మిగతా వాళ్లకు కూడా నిగ్రహం అవసరం.

## డాక్టర్ కబుర్లు

### రక్తపు పోటు తక్కువైతే

ఎవరికైనా రక్తపుపోటు తక్కువగా ఉంటే ట్రీట్‌మెంట్ అవసరమా?

రక్తపుపోటు సగటుకన్నా తక్కువ ఉంటే అలసిపోతామనీ, తేలిపోతున్నట్లు ఉంటుందనీ ఎందరో అనుకుంటారు. 'మామూలు' విలువ వచ్చేస్తే అంతా సరిపోతుందనుకుంటారు. తక్కువపోటు వుండేవారిలో కొందరిలో ఈ గుణాలు కనిపించవచ్చు. కానీ భీమా కంపెనీల లెక్కప్రకారం యితరత్రా మంచి ఆరోగ్యం కల వ్యక్తికి తక్కువ రక్తపు పోటు ఉంటే ఆవ్యక్తి ఆయుర్దాయం అధికంగా ఉంటుందని తెలుస్తోంది. సాధారణంగా సన్నగా ఉండేవారికి తక్కువ పోటు ఉంటుంది. వీరికి ఆహారం చాలక పోతే లేదా ఆహారం జీర్ణం అవకపోతే, లేదా ప్రయాస అధికంగా ఉంటే వచ్చే బాధలు రక్తం పోటు తక్కువ అవటం వల్లనే అనుకుంటారు. కానీ చికిత్స



పై రోగాలకి చెయ్యాలి. రక్తపుపోటు తనపని తను చూసుకుంటుంది.

హెచ్. ఎల్. హెర్షవిచ్
(కాపీరయిటు)

## ...తల్లి బాధ్యత

మాటలు పూర్తిగా వచ్చిన పిల్లలు కొంచెం పెరిగేక వాళ్ళను కదిలించటం చాలా తేలిక. ఈ లేత వయసులో, అంటే ఆరేళ్ళనుండీ పది పన్నెండేళ్ళు వచ్చే వరకు సంఘ జీవనానికి అలవాటు పడుతున్న యీ సమయంలో ఎదుటి వ్యక్తులపై వాళ్ళ కేర్పడిన అభిప్రాయాలు కలకాలం నిల్చిపోతయ్. ఇలాటి అభిప్రాయాల్లో ఒకటి మనిషికీ మనిషికి మధ్యగల తారతమ్యాలు. ఈ తారతమ్యాలు డబ్బులో, హోదాలో, కులంలో దేనివల్లనైనా కావచ్చు. బాగా స్థితి మంతులైన స్త్రీలు (ఈ విషయంలో పురుషులే కాస్త మెరుగు) తమ చీరలను గురించి. నగలను గురించి గొప్పలు చెప్పు కుంటూ అవి లేనివారిని తక్కువ చూపు చూస్తారు. ఎప్పుడూ తల్లి కొంగు పట్టుకుని తిరిగే పిల్లలు యీ విషయంలో అక్షరాలా ఆమె ననుకరించటం మొదలెడ్తారు. ఒక ఐదేళ్ళ పిల్ల—బాగా స్థితి మంతుల బిడ్డ తన పినతల్లి కొడుకుని ఆటలో చేరనివ్వక తరిమి తరిమి కొడ్తోంది. ఆ దృశ్యాన్ని చూస్తున్న నాకు ఆ పిల్ల కళ్ళలోని అహం భావం, గిర ల్పీ చూసి ఆశ్చర్యమేసింది. దానికి ఆ పిల్లను నిందించవలసిన అవసరం లేదు. ఆ పిల్ల తల్లి టెర్లిన్ ఫ్రాకులు తొడిగే పిల్లలతోనే ఆడుకోనిస్తుంది. ఈ అబ్బాయికి వంటిమీద చొక్కాలేదు. ఉన్న చెడ్డీ కూడా మురికి వాసన కొడ్తోంది. అలాటి పిల్లలతో ఎలా ఆడుకోగలదు శ్రీమంతుల బిడ్డ?

మనదేశ ప్రజలలో ఉన్న మరో దౌర్భాగ్య లక్షణం కులభావం. ఏనాడు ఏ ఉద్దేశ్యంతో ప్రారంభమైనదో కానీ యీ కులాల వారీ విభజన— యిది యీ నాటికి మనిషి యొక్క గౌరవానికి, సంఘంలో అతనికి గల స్థానానికి కారణ భూత మౌతోంది. పెద్ద కులాలనబడే వాళ్ళు తమ పిల్లలతో 'ఇదో ఆ పిల్లలతో మరీ పూసుకు తిరక్కు' అని. 'వాళ్ళతో ఆడు కుంటే ఆడుకున్నావ్ కాని వాళ్ళింట్లో ఏమైనా పెడితే తినకూ' అని యిలా నూరిపోసి ఆ పిల్లలను తమ పిల్లలనుండి మానసికంగా దూరం చేస్తూ వాళ్ళకంటె తమ కేదో ఆధిక్యం ఉన్నదన్న భ్రమ పుట్టిస్తారు. ఈ భావన ఆ పిల్లల వయసుతో పాటు పెరిగి పెద్దదై ఉన్నత విద్య నభ్యసించి ఉద్యోగాల్లోకి చేరినా కూడా వదిలి పెట్టదు. ఈనాడు యూని వర్శిటీల్లోను, ప్రభుత్వోద్యోగాల్లోను కూడా చదువులకి, ఉద్యోగాలకి సీట్ల విషయమై కూడా కులమతాలు కలగ జేసుకుంటున్నాయంటే చిన్నతనంలో పిల్లల హృదయాల్లో నాటబడిన విషబీజాలే దానికి కారణం.

అలాగే 'నీ పొరుగు వానిని ప్రేమించుము,' అన్న సూక్తిని అందరం వల్లిస్తాం. కాని త్రికరణ శుద్ధిగా దాని నాచరించే వాళ్ళు మనలో ఎంత మంది ఉంటారు? ఎదుటి వాడికి మనకంటె ఏమైనా ఎక్కువుంటే అసూయ. తక్కువుంటె చులకన. ఎదుటివాడు జీవితంలో పైకి పోతే దానికి కారణం 'అదృష్టం' అదే మనం పోతే అది మన ప్రజ్ఞ! అలాగే ఎదుటి వాడు ఏ కారణం చేతనైనా జీవితంలో ఓడిపోతే వాడు అసమర్థుడు: మనం ఓడిపోతే 'కాలం కలసిరాలేదు' ఇలాటి గుణాలన్నీ కాస్తో కూస్తో మనందరిలోనూ ఉన్నయ్.

తల్లి తన బిడ్డలకు—ముఖ్యంగా మగ పిల్లలకు నేర్పవలసిన మరో ముఖ్యవిషయం స్త్రీలను గౌరవించటం. అంటే నా అర్థం ఆరేళ్ళ పిల్లవాడితో 'స్త్రీని గౌరవించుము' అంటూ నీతులు చెప్పటంకాదు. సాధారణంగా మన యిళ్ళల్లో ఆడపిల్లలకి, మగ పిల్లలకి ఆటల్లో తేడాలుంటయ్. అమ్మాయికి లక్కపిడతలిచ్చి అబ్బాయికి 'కీ' కారు, విమానం యిస్తారు. లక్కపిడతలతో విసుగెత్తిన అమ్మాయి తన తమ్ముడి 'కీ' కారు కావాలని ఏడుస్తుంటె 'ఆడదానివి నీ కెందు కలాటివి?' అంటూ గద్దిస్తుంది తల్లి. మరోసారి తమ్ముణ్ణి అడిగితె వాడూ అదే మాట పలుకుతాడు. 'ఆడదానివి. నీకెందుకు?' అని.

అలాగే మగపిల్లలున్నా యింట్లోని ఆడ పిల్లలకు తమ అన్నదమ్ముల్లా గోడలు, చెట్లు ఎక్కాలనీ, గోలీకాయ లాడాలని అని పించవచ్చు. కాని తల్లి ఆ వయసులో కూడా అవి ఆడపిల్లలు చెయ్యవలసిన పనులు కావంటూ శాసిస్తుంది. దాంతో ఆడపిల్లల్లో సహజంగా ఉన్న ధైర్యోత్సాహాలు, శారీరక దార్ఢ్యం కూడా మరుగుపడి పోయి 'నేను వట్టి ఆడదాన్నే' అన్నభావం కలుగుతుంది. అలాగే మగపిల్లలకి కూడా తనతోపాటు పుట్టిన అక్కచెల్లెళ్ళు ఆడ వాళ్ళవటం వలన తనకంటే తక్కువన్న భావం కలుగుతుంది. కాలేజీల్లో కాస్త కంటికి నదురుగా కనపడే అమ్మాయిలను వెంటపడీ, వెక్కిరించీ, యింకా ఘోరంగా కూడా అవమానించే ధీరులంతా ఎవ రంటారు? చిన్నప్పటినుండి ఆడదంటే వంట చెయ్యటానికి, పిల్లల్ని కనటానికి తప్ప మరెందుకు పనికిరాదన్న భావాన్ని పెంచుకున్నావాళ్ళే వీళ్ళంతా. అందుకే స్త్రీని గౌరవించవలసిన బాధ్యతని మాటలలో కాక చేతలలో చూపించాలి తల్లి. ఈ విషయంలో తండ్రి సహకారం కూడా ఎంతో అవసరం. స్త్రీకి గౌరవం లేకపోవటం దేశ పతనానికి మొదటి మెట్టు.

తల్లియొక్క మరో కర్తవ్యం పిల్లల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలలో ఔచిత్యం కలుగ జేసుకోకపోవటం, అంటే విచ్చలవిడిగా వాళ్ళను వదిలిపెట్టటం కాదు. చాలా మంది తల్లిదండ్రుల దృష్టిలో పిల్లలకు స్వేచ్ఛనిస్తే చెడిపోతారన్న భయం, అనుమానం ఉంటయ్, అందుకే ఇరవైయేళ్ళొచ్చినా ఒంటరిగా ఎక్కడికీ పోనీయకుండా, ఆఖరికి కాలేజీల్లో ఎక్స్కర్షన్లాంటివి జరిగినా పోనీయకుండా బందోబస్తు చేస్తారు. ఇలా చేయటంవలన మానసికంగా వారు పెరగకపోవటమే కాక ఒక్కసారిగా జీవితంలో ప్రవేశించేక విశృంఖలంగా ప్రవర్తించే ప్రమాదం కూడా ఉంది.

ఇవన్నీకాక జీవితంలో ఒక ఉన్నతమైన స్థానాన్ని ఆక్రమించటానికి కూడా తల్లి సహాయపడగలదు. దీనికి సహజంగా తల్లి కూడా విద్యావతి అయిఉండాలి. అలాటప్పుడు తీరికవేళల్లో పిల్లలకు అక్షరాలు దిద్దించి; చదువంటే ప్రేమబెత్తం షరతులు గుర్తొచ్చి బెదిరిపోయేట్లు కాక మనిషి మనుగడకు ముఖ్యావసరాల్లో విద్య ఒకటి అని తెలిసేట్లు చెయ్యాలి. పురాణకాలం లోను, ఆ తరువాత జన్మించిన మహా పురుషుల జీవిత చరిత్రలు కథారూపంలో వివరించి అంతటి గొప్పవాళ్ళు కావాలంటే తాముకూడా చదువుకోవాలన్న దృఢ సంకల్పాన్ని పిల్లల్లో కలగజేయాలి తల్లి.

అంతేకాక సాంకేతిక విద్యకి ప్రాధాన్యతనిచ్చి, చదువు పొట్టకూటికోసమేనన్న ప్రయోజనానికి దిగజారిపోయిన యీ రోజుల్లో మన సంస్కృతిని, ధర్మాన్ని బోధించే సాహిత్యాన్ని కూర్చిన పరిజ్ఞానాన్ని తల్లి తన పిల్లలకు నేర్పాలి. పార్వతీదేవి

వివరంటే 'మిసెస్ శివ' అనకుండా విదేశీయులు మహాభారతాన్ని గురించి వర్ణిస్తుంటే నోరెళ్లబెట్టకుండాను ఉండాలంటే చిన్నతనం నుండి సాహిత్యాభిలాష కలిగేట్లు చూడాలి. భగవద్గీత వ్రాసిందెవరో తెలియని విద్యార్థులకు భారతీయులు కొల్లలు! ఇకముందునుండైనా యిలాంటి దౌర్భాగ్యం మనదేశానికి పట్టకుండా ఉండాలంటే నూటికి తొంభై వంతుల బాధ్యత తల్లిదే.

ఇలా అన్ని రంగాల్లోను విద్యావంతులై సహృదయులు, సంస్కారవంతులు అయిన బిడ్డలను చూసి ఫలపుష్ప భరితమైన ఆ మహావృక్షాలకు బీజం నాటింది తనేనన్న తృప్తి, గర్వంకన్న మరేం కావాలి కన్న తల్లికి? ●

వంటలు :

## తేనెతో సాస్

తేనె—సగం కప్పు

నిమ్మకాయ (సగం)—రసం

తేనెను కాగబెట్టి అందులో నిమ్మరసం వేసి కలియపెట్టాలి. దీనిని వేడిగా అయినా చల్లారిన తర్వాతయినా వాడుకోవచ్చు. ●

# జరాతుష్ట్ర

అది బుద్ధుడు జన్మించిన శతాబ్దమే. క్రీస్తు పూర్వం 583 సంవత్సరం. పర్షియాలో బాల్క్ అనే గ్రామంలోని అగ్ని దేవాలయంలో ఒక వృద్ధుడు ధ్యానంలో మునిగి ఉన్నాడు. అతనొక మహాముని అయి ఉంటాడని చూస్తేనే తెలుస్తోంది. ఇంతలో ఒక దుర్మార్గుడు ఆలయంలోకి వచ్చి వృద్ధుడి వక్షంలో బల్లెం పెట్టి పొడిచాడు. అతను నేల మీదకి వొరిగి పోయే ముందు తన జపమాలని హంతకుడి చేతిలో ఉంచి, 'అహురా (దేవుడు) నేను నిన్ను క్షమించినట్లే క్షమించుగాక!' అని ప్రాణాలు వదిలాడు.

ధ్యానంలో ఈ ఆఘాతానికి లోనయిన ఆ వృద్ధుడు జరాతుష్ట్రుడు. ప్రాచీన ఇరాన్ మత స్థాపకుడు.

జరాతుష్ట్రుడు చిన్న వయస్సులోనే తన సాధారణ సామాజిక జీవితానికి స్వస్తి చెప్పి కొండమీద ఒంటరిగా ఉండిపోయాడు. కొన్ని సంవత్సరాల తర్వాత జ్ఞానోదయం అయింది. అప్పటికి అతనికి ముప్పయిఏళ్లు. తిరిగి సమాజంలోకి తిరిగి వచ్చేసి తన ఉపదేశం ప్రారంభించాడు. మొదట్లో అతని ఉపదేశాన్ని ఎందరో నిరసించినా పన్నెండేళ్ల తర్వాత అప్పటి బాక్ట్రియా రాజు విష్టాస్పుడిని తన మతంలో చేర్చుకున్న కాలానికి జరాతుష్ట్ర మతం మంచి ప్రచారంలోకి వచ్చింది. చైనా దాకా కూడా పాకింది. జరాతుష్ట్రుడు తన 77వ ఏట మరణించాడు.

అప్పటి కాలంలో ఇరాన్‌లో 'దేవ' పూజ మంచి ప్రచారంలో ఉండేది. అక్కడ 'దేవ' అనే మాటకి 'రాక్షసు'డనే అర్థం ఉండేది! ఈ పూజలో ఇంద్రియ సంబంధమయిన అంశాలు చాలా ఉండేవి. జరాతుష్ట్రుడు తన మతంలోని ఈ రకం పూజలని బహిష్కరించి సంస్కరించటమే తన లక్ష్యంగా భావించాడు. జరాతుష్ట్రుడి సందేశం సారాంశాన్ని ఈ కింది విధంగా వర్ణించవచ్చు—

ఆదిలో మంచి, చెడులని నిరూపించే శక్తులు రెండు ఉండేవి. ఓర్ మజ్ద్ వెలుగు, ప్రాణమూ కూడా! విశ్వంలోని మంచిగా ఉండే వాటన్నిటి సృష్టికీ ఓర్ మజ్దయే కారణం. చీకటి దీనికి విరుద్ధం. మలినం, చావు, చెడు ఈ వైరుధ్యంలో నించే జన్మిస్తాయి. చివరికి మంచి గెలిచి తీరుతుంది.

మానవుడు ఈ భూమిమీదనే కాక మరణానంతరం కూడా జీవిస్తాడు. భూప్రపంచంలో అతని నడవడికని పట్టి తర్వాత జీవితం ఉంటుంది.

మంచి ఆలోచనలచేత, మంచి మాటల చేత మానవుడు పవిత్రంగా జీవించగలుగుతాడు. ఈ ప్రపంచంలో ఉంటూనే సత్ప్రవర్తన వల్ల ఆత్మ భగవంతుడితో ఐక్యం అయ్యేట్లు చెయ్యటం వీలవుతుంది.

నేడు ప్రపంచంలోని జరాతుష్ట్ర మతం వారు ఇంచుమించు అందరూ భారతదేశంలోనే ఉంటున్నారు. కొందరు మాత్రం ఇరాన్‌లో మిగిలారు. (మహమ్మదీయ మతంలోకి మారటానికి ఇష్టంలేనివారు భారత దేశానికి 8—12 శతాబ్దాల మధ్యలో పారిపోయి వచ్చారని సంప్రదాయం. సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడు కె. కె. భాభా, పారిశ్రామిక వేత్త టాటా, స్వతంత్రపార్టీ నాయకుడు మసానీ, దేశభక్తుడు దాదాభాయి నవురోజీ పార్శీలలోని ప్రముఖులు కొందరు.)

శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు ఒకసారి ఇలా అన్నారు— 'వైదిక మతంతో ఎన్నో పోలికలు కల జరాతుష్ట్ర మతం వారు భారతదేశాన్ని తమ దేశంగా చేసుకొనటం మనకి గర్వకారణం. పార్శీలు ఈ దేశం ఆధ్యాత్మిక, వాస్తవిక అభివృద్ధికి ఎంతో తోడ్పడ్డారు.

—ఎస్.

---

## అభియోగాలలో వింతలు

# భర్తకు పరిహారమిచ్చిన భార్య

మిస్‌మావిస్ షిష్‌బర్న్ తన భర్తను వలలో వేసుకున్నదని శ్రీమతి జెనిస్ బ్రియాంట్ తెచ్చిన అభియోగాన్ని హైకోర్టు తోసేసింది. రూ 1,000 లు పరిహారంగా భర్తకు చెల్లించవలసినదిగా శ్రీమతి బ్రియాంట్‌ను న్యాయమూర్తి వాలర్ ఆదేశించారు.

శ్రీమతి బ్రియాంట్ వయస్సు 49 సంవత్సరాలు తన భర్తను కోల్పోయినందుకూ ఆ కారణంగా తను క్లేశపడవలసి వచ్చినందుకూ రూ 50,000 ల పరిహారమిప్పించవలసినదిగా న్యాయస్థానాన్ని శ్రీమతి బ్రియాంట్ కోరింది. కానీ పాపం! ఆమె వాదనను న్యాయమూర్తి వాలర్ తోసిపుచ్చారు. పైగా యిట్లా అన్నారు: 'దావా ప్రారంభించి ఓడిపోయినవారే అవతలి పక్షం వారికైన ఖర్చులను చెల్లించవలసి వుంటుంది. నీదావా గెలిచే అవకాశమెన్నడూ కనిపించలేదమ్మా నాకు'

శ్రీమతి బ్రియాంట్ 'నేను ఓడిపోతానని అనుకోలేదండి.'

న్యాయమూర్తి 'నువ్వు గెలవడం ఎట్లా సాధ్యపడి ఉండేదో నాకు అర్థం కావడం లేదమ్మా.'

బ్రియాంట్ల వివాహం 1942 లో జరిగినది. భవననిర్మాణ యజమానుల సమాఖ్య ప్రజాసంబంధాల శాఖాధికారిగా 1950 నుంచి శ్రీ బ్రియాంట్ పనిచేస్తున్నారు.

భాగ్యవంతుడైన కంట్రాక్టరు కుమార్తె మిస్ షిష్‌బర్న్—శ్రీ బ్రియాంట్ సహాయోద్యోగిగా 1952 లో నియమితురాలైనది. విడాకులు కావాలని 1959 లో తన భార్యకు చెప్పాడు శ్రీ బ్రియాంట్.

న్యాయవాది సలహా తీసుకుని 1960 ఫిబ్రవరిలో శ్రీమతి బ్రియాంట్ వేరే పోయినది. ఇన్‌గ్రావ్‌కోర్టు కేవెండిష్ రోడ్‌లో ఉంటున్నది ఇప్పుడు.

తనభార్య నిర్దయురాలు కాబట్టి విడా

కీలు ఇప్పించాలంటూ 1960 లో శ్రీ బ్రియాంట్ దరఖాస్తు పెట్టుకున్నాడు ప్రయోజనంలేక పోయింది.

తనభార్య తనసుంచి వేరేపోయింది కనుక విడాకు లిప్పించ వలసినదిగా కోరుతూ 1964 లో శ్రీ బ్రియాంట్ మళ్ళీ దరఖాస్తు పెట్టుకున్నాడు. ప్రయోజనం లేకపోయింది.

1965లో మావిస్ ఫిష్‌బర్న్ తనపేరు మార్చుకుని బ్రియాంట్‌తో సంసారం చెయ్యడానికి వెళ్ళింది. రిచ్‌మండ్ అప్పర్ పార్క్‌రోడ్, నార్త్‌హోల్ట్‌లో కాపురముంటున్నారు వారిద్దరూ.

తనభర్త నెలకు రూ4000 లు సంపాదించేవాడు కనుక మొత్తం రూ 50,000లు పరిహారంగా ఇప్పించాలని శ్రీమతి బ్రియాంట్ వాదన. డబ్బునష్టం మాత్రమేకాదు—తన భర్తతోపాటు ఏడాదికి పది పన్నెండు సమావేశాలలో పాల్గొనే అవకాశాలను కోల్పోవలసి వచ్చిందనీ, హోటళ్ళల్లో విందు లారగించే అవకాశాలను కోల్పోవలసి వచ్చిందనీ, మానసికంగా చాలా బాధపడవలసి వచ్చిందనీ ఆమె చెప్పుకున్నది.

1964 కి పూర్వం తమ యిద్దరి మధ్యా ఆక్షేపణీయమైన సంబంధాలేవీ లేవని శ్రీ బ్రియాంట్, ఫిష్‌బర్న్ వాదించారు.

మరి మీ వివాహం ఎందుకని చెడిపోయిందయ్యా అని అడిగితే శ్రీ బ్రియాంట్ ఇట్లా చెప్పాడు. 'నా భార్య సమర్థురాలే కానీ స్వార్థపరురాలు. కొరకరాని కొయ్య.'

శ్రీ బ్రియాంట్‌ను వలలో వేసుకున్నదనే ఆరోపణను మిస్ ఫిష్‌బర్న్ ఖండించింది. తన డబ్బుతో బ్రియాంట్‌ను వ్యామోహపరచడం వంటిదేమీ జరగలేదన్నది.

బ్రియాంట్ దంపతులు విడిపోవడానికి మిస్ ఫిష్‌బర్న్ కారణం కాదని తీర్పులో న్యాయమూర్తి నిర్ణయించారు. బ్రియాంట్ ఈ వ్యాజ్యంతో చేసిన ఖర్చులకుగాను రూ 1000 లు శ్రీమతి బ్రియాంట్ అతనికి చెల్లించాలన్నారు న్యాయమూర్తి.

—వి. ఎస్. అవధాని.



# మల్లన్నమంత్రి • ఇసుకరథం ........ కౌటిల్య

ఒకప్పుడు సైన్యంలోని రథాలు పాతబడిపోవడం వలన కొత్త రథాలను చేయించవలసి వచ్చింది. తమదేశం లోని పని వాళ్లకంటే, ప్రక్కదేశం లోని ఉన్న వీరబ్రహ్మం రథాలను బాగా తయారు చేస్తాడని మల్లన్న మంత్రికి తెలిసింది.

మల్లన్న మంత్రి రాజ్యానికి ప్రక్క రాజ్యానికి అంతగా సరిపడదు. అందు చేత వీరబ్రహ్మం రథాలు తయారు చేసి మల్లన్న మంత్రికి యివ్వడానికి ప్రక్క దేశపురాజు అంగీకరించడు.

ఒకనాడు మల్లన్నమంత్రి మారు వేషంలో వెళ్లి వీరబ్రహ్మన్ని కల్సు కొన్నాడు — రథాలను తయారుచేసి తమ రాజ్యానికి యివ్వవలసినదిగా మల్లన్న మంత్రి అతన్ని కోరేడు.

'రథాలను తయారుచేసి యివ్వ డానికి నాకు యేమీ అభ్యంతరం లేదు కాని యిక్కడనుంచి రథాలను మీ దేశం తీసికొని వెళ్లడానికి యీ దేశపురాజు అంగీకరించడు. మీరు యేదో ఒకవిధంగా రథాలను యిక్కడ నుంచి తీసికొని వెళ్ల గలిగినట్లయితే నేను మీకు రోజుకు ఒక రథాన్ని తయారుచేసి యివ్వగలను' అన్నాడు వీరబ్రహ్మం.

'ఇక్కడనుంచి రథాలను మా దేశానికి తీసికొని వెళ్లే బాధ్యత మాది. నీవు మాత్రం రథాలను తయారు చేసి రోజూ ఒక రథం చొప్పున మా భటులు జయ విజయులకు యిమ్మని మల్లన్న మంత్రి వీర బ్రహ్మంతో చెప్పేడు. తరువాత అతనికి కావలసిన డబ్బు యిచ్చి తన రాజ్యానికి వచ్చేడు మల్లన్న మంత్రి.

ఒకనాటి ఉదయం రథం నిండా యిసుక వేసికొని జయ విజయు లిద్దరూ ప్రక్కదేశపు సరిహద్దు దగ్గరకు వచ్చేరు ఆ సరిహద్దు దగ్గర కాపలా ఉన్న భటులు రథంలో యేమి ఉన్నదని ప్రశ్నించేరు.

'నాకు యీ మధ్యను చాలా జబ్బు చేసింది. అప్పుడు అవతల దేశంలో ఉన్న కాళికాదేవి కన్పించి యిలాగ చెప్పింది. నాగుడి చుట్టూ చాలా గోతులు ఉండి పోయేయి. వాటిని పూడ్చడానికి ఒక సంవత్సరం పాటు రోజూ ఒక రథంతో యిసుకను తీసి కొని వచ్చి పోసినట్లయితే నీ జబ్బు నయమవుతుంది. మర్నాటి నుంచీ నా జబ్బు తగ్గిపోయింది. అందుచేత కాళికాదేవి గుడివద్దకు యిసుకను తీసికొని వెడుతున్నానని సమాధానం యిచ్చేడు జయుడు.

యుద్ధ సామగ్రిని యీ దేశం నుంచి ఆ దేశంలోనికి తీసికొని వెళ్ల కూడదు గాని యిసుకను తీసికొని వెళ్లడానికి నిషేధం యేమీలేదని సరిహద్దు కాపలా భటులు అను కొన్నారు. అయినా, యిసుకలో దేని నైనా దాచేరేమోనని భటులు యిసుకను తనిఖీ చేసేరు కాని అందులో యేమీ దొరకలేదు. అప్పుడు రథాన్ని యివతలకు రానిచ్చేరు.

ఆ రథాన్ని యివతల దేశంలో వదలి వేసి జయ విజయులు ఆ గుర్రాలమీదనే మరొక మార్గంద్వారా మళ్లీ ప్రక్క రాజ్యంలోనికి వెళ్లేరు.

మర్నాడు మళ్లీ యిసుకతో రథం రాగానే సరిహద్దు దగ్గర ఉన్న భటులు దాన్ని ఆపి యిసుకను తనిఖీ చేసేరు కాని అందులో యేమీ దొరకలేదు. అందుచేత రథాన్ని యివతలకు రానిచ్చేరు. అలాగే రోజూ జయ విజయు లిద్దరూ యిసుక రథంలో యివతలకు వస్తుండే వారు.

'ఈ యిసుకలో బంగారము వగైరా యేదైనా ఉన్నదేమో'నని కొన్నాళ్ల తరువాత ఆ భటులకు అనుమానం వచ్చింది. వెంటనే కొంత యిసుకను రసాయన పరీక్ష నిమిత్తం రాజధానికి పంపేరు.

ఆ యిసుక మామూలు యిసుకే నని కొన్నాళ్ల తరువాత రాజధాని నుంచి వర్తమానం వచ్చింది. ఆ తరువాత జయ విజయులు యిసుక రథంతో యివతల దేశానికి రావడానికి భటులు యెప్పుడూ అడ్డుచెప్పలేదు.

మల్లన్న మంత్రి ఆలోచనప్రకారం జయ విజయులు ఆ విధంగానే రోజూ ఒక రథం చొప్పున తమ రాజ్యానికి తీసికొని వచ్చేరు. ●

# మెదడుకి మేత

డాక్టర్ మహీధర నళినీమోహన్

సరస్సు

(క) ఒక చిన్న సరస్సు చుట్టూ నలుగురు పల్లెవాళ్లు పూరిగుడిసెలు వేసుకుని ఉంటున్నారు. ఆ ప్రదేశం మీద మోజు కలిగిన నలుగురు భాగ్యవంతులు బొమ్మలో చూపినట్లు పెద్ద పెద్ద భవంతులు కట్టేరు. పల్లెవాళ్లు ఆ సరస్సును వాడుకోవడం ఇష్టంలేక భాగ్యవంతులు కుట్రపన్ని, సరస్సు తమకు మాత్రమే అందుబాటులో ఉండేటట్లు, పల్లెవాళ్లకు అస్కారం లేకుండేటట్లు, ఒక గోడ కట్టేశారు. ఆ గోడని పల్లెవాళ్లు పీకెయ్యబోవడమూ, శాంతిభద్రతలను కాపాడడానికి కంకణం కట్టుకున్న పోలీసువారు ఆత్మరక్షణ కోసం కాల్పులు జరుపగా ఒక పల్లెవాడు చచ్చిపోవడమూ—అదంతా వేరే కథ అనుకోండి.

ఇంతకీ ఆ భాగ్యవంతులు గోడను ఎల్లా కట్టేరో మీరు ఊహించగలరా?

## నాలుగు వాటాలు

(చ) నాలుగు వాటాలు :

ఒకడు తన నలుచదరపు స్థలంతో ఒక నాలుగోవంతు చదరపు ముక్కను అమ్మేశాడు. మిగిలిన భాగాన్ని అతడి అనంతరం అతడి నలుగురు కొడుకులూ పంచుకోవడంలో ఇబ్బంది వచ్చింది. 'వైశాల్యం సమానంగా ఉంటే చాలదు. ఆకారాలు కూడా ఒక లాగే ఉండాల'ని పట్టుపట్టేరు. ఆ మిగిలిన స్థలాన్ని ఒకే ఆకారంలో ఉండే నాలుగు సమాన భాగాలు చేయడం ఎల్లాగో తెలియక తంటాలు పడుతున్నవారికి మీరేమైనా సాయం చెయ్యగలరా?



* * *

## పలుపు ఎంత పొడుగు?

(ట) పలుపు ఎంత పొడుగు?

మూడు భుజములూ సమానంగా ఉండే త్రిభుజాకారపు స్థలంలో ఒక మూల మేకుని తాడుకట్టి ఒక మేకని కట్టేశారు. ఆ స్థలం వైశాల్యం రెండువేల చదరపు గజాలు. చూడగా ఆ మేక సరిగ్గా సగం స్థలంలోని పచ్చికను మాత్రమే అందుకోగలిగిందని తేలింది. అయితే దాని మెడకు కట్టిన తాటి పొడవు ఎంత?

(జవాబులు 64 వ పేజీలో)

గోధుమ— బియ్యమూ అంటావేఁవిటమ్మా

బీహార్ క్షామ నివారణా కేంద్రం

Jayadev

సీరియల్



తాడిగిరి పోతరాజు

## జరిగిన కథ

వెంకట్రామయ్యగారు ఓ హైస్కూలు సంస్థాపకులు. ఆయన కుమారుడు మధు. వారింట్లో పెరిగిన అనాధ ప్రసాద్. ఆ స్కూల్లో పనిచేసే హెడ్మాష్టరు కామయ్య ఆయనకు ఆప్తమిత్రులు. మధు, కామయ్యమాస్టారి కూతురు శారదను ప్రేమిస్తాడు. శారద అంగీకరించదు. ప్రసాద్‌మీద శారదకు ఎంతో అభిమానం. కాని, ప్రసాద్ ఆమెని గుర్తించడు. మధులో ఇదివరకటి హుషారు లేదు. చాలా మారిపోయాడు. శారదకు ఇప్పుడిప్పుడు మధుమీద ధ్యాస అధికమవుతున్నది. గ్రామంలో పంచాయితీ ప్రెసిడెంటు ఎన్నికకోసం చర్చజరుగుతుంది. ప్రత్యర్థి వర్గంలోని కామయ్యమాష్టారి మీద శివరామయ్య నిందలుమోపి, స్కూల్లోనుంచి తొలగిస్తాడు.

## 19

వేసవిగాలులు పోతూ వర్షాలను తెచ్చి పెట్టాయి.

'వద్దు'—'వద్దు'నే వరకూ వానలు కురిసి— శారద రాత్రుల పండు వెన్నెల తెచ్చాయి.

చలి 'గజగజ' లాడించి—శివరాత్రితో 'శివ—శివ' అంటూ విష్క్రమించింది.

చెట్లు ఆకులు రాల్చుకొన్నాయి—కోయిలలు వసంతఋతువును తెచ్చాయి.

చెరువుల్లో—బావుల్లో నీళ్ళను పీల్చి పారేస్తూ మళ్లీ వేసవి వచ్చి ఒక సంవత్సరాన్ని కాలగర్భంలో కలిపింది. అనూహ్యమైన మార్పులనూ అవాంఛితమైన కష్టాలనూ తెచ్చి బలవంతంగా ఆ ఇంటిపైన రుద్దిన ఆ సంవత్సరం ఏమీ ఎరగనట్లే ప్రక్కకు తప్పుకొంది.

'బి. ఏ—' 'బి. యస్. సి' పరీక్ష ఫలితాలను మోసుకొచ్చింది దినపత్రిక. శారద రెండవ తరగతిలో ఉత్తీర్ణురాలయింది— ప్రసాద్ నంబరు 'సెకండ్ పార్ట్' తెలుగులో మినహాయించి తక్కిన రెండు పార్ట్సులలోనూ కనిపించలేదు.

'ఇదుగో—మధూ—నీ మూలంగానే నేను సెకండ్ క్లాసులో ప్యాసయ్యాను.——లేకపోతేనా!' అంటూ ఫలితాలు పడిన ఆ దినపత్రికను ప్రేమ పూర్వకంగా అతని మీదికి విసిరింది —ఓరకంటితో చూస్తూ—ఎర్రంచు తెల్లచీర కట్టుకొని సాదాగా ఉన్నా అందులో ఒక అపూర్వమైన అందం కనిపించింది. శంఖంలాటి ఆమె కోమల కంఠంపై సిరు మడతలలో స్వేదబిందువులు నిగనిగలాడుతున్నాయి.

'ఆ—మరి— నే నేమనుకోవాలి — నీ మూలంగానే పరీక్షలకు పోలేదు'—మెడ ప్రక్కకు వాల్చుకొని ముద్దుగా అన్నాడు. మల్లెపువ్వులాంటి తెల్లని ఓపెన్‌షర్ట్ పంట్లాం వేసకొని కుదురుగా కుర్చీలో కూర్చొని అన్నాడు.

'అవునవును...పేపర్లో మన నంబరు వెదికే శ్రమ మాకు తప్పించటం కోసమై పరీక్షలకు ముందే 'పెట్టే బేడా' సర్దుకొని నిశ్చింతగా ఇంటి కొచ్చావ్—సిగ్గు లేకపోతే సరి...అదీ ఒక గొప్పతనమే—పైగా చెప్పుకోవటం—ఇక దయచెయ్యండి......'తైమయి పోయింది.'......

బయట రోహిణీ కార్తె ఎండలు నిప్పులు చెరగి పోస్తున్నాయి. నాల్గున్నరదాటినా చెంపలు మండిపొయ్యేలా వడలు విసిరి విసిరి కొడుతున్నాయి. చూస్తూ చూస్తుండగనే చల్లబడి పోయింది. తూర్పున బరువుగా నల్లని మేఘాలు కనిపించాయి. గాలిస్తంభించి పోయింది. ఆ మూలన పెళ పెళమని ఉరుము ఉరిమింది.

ఎండలోనే టప—టప మని ఇంతింత చినుకులు రాలసాగాయి.

తెల్లని సూర్యకాంతిలో తొలకరి చినుకులు పడుతున్నాయి. సలసల కాగిపోయిన భూమి చినుకులకు తడిసి అదొక రకమైన వాసన లీనుతోంది.

శారద వాకిటిలో నిలబడి చూసింది.

'నక్కలు—పెళ్ళిళ్ళుచేసి కొంటాయంట? అంటూ పిల్లలు వాకిలి ముందు 'తల్లీ బిల్లీ' తిరుగుతూ తలలు తడుపు కొంటున్నారు' తొలకరి చినుకలతో ఒళ్ళు పులకరించి చిందులు తొక్కుతున్నారు.

భానూ—భాస్కర్‌తో పంచపాళీలో వాన గుంటలు ఆడుతోంది.

'జగమొండి దానివి.....తొండిచెయ్యకు' భాస్కర్ అరుస్తున్నాడు.

'నేనా తొండి...వాగకు... ఓడిపొమ్మని ఎవరన్నారు నిన్ను' అంటూ భాస్కర్ గుంటల్లో రాళ్ళన్నీ తన ముందు పోసి కొంటూ అన్నది.

శారద గిరుక్కున వెనుతిరిగి—'ఇక వెళ్ళు ... వాన పెద్దదయితే ఇక నీవు పోలేవు...వెళ్ళు...మా నాన్నగారు వచ్చే వేళయింది—' కన్నులలో తొట్రుపాటు కనిపించింది.

'వాన కురుస్తుంటే ... మీనాన్నగారు మాత్రం ఎలా వస్తారూ?' అంటూ తనకు సరియైన సమాధాన మిచ్చానన్న సంతృప్తితో నవ్వుతూ లేచి టీపాయ్ పై కూర్చున్నాడు ఆమెకు దగ్గరిగా...

'ఇదే నీతో నాకుబాధ— పొమ్మంటే వెంటనే పోవు...పో—పో అని పోరుపెట్టుకొంటే జగన్నాధుని రధచక్రాల్లో ఎప్పటికో కదలిక ... ఆమె విసుగుపడ సాగింది...' ఇంకొక విషయం నీతో జెప్పాలనుకొని మరిచే పొయ్యాను...ఈ మధ్య నీవు ఎక్కువగా మా ఇంటికొస్తున్నావ్ మధూ—తరచుగా ఇక రావద్దు—నేనిప్పుడే చెబుతున్నా! ఇవన్నీ మళ్ళీ ఎలా పరిణమిస్తాయోనని

నాకు భయంగా ఉంది ... అసలే పిల్లిద్దరికీ మధ్యవచ్చిగడ్డివేస్తే భగ్గున మండుతుంది... ఇంకొక విషయం ... మీ మామయ్యకుగానీ మీ అమ్మకుగానీ అనుమాన మొచ్చిందంటే మనకు ఈ మాత్రం చూసికొనేభాగ్యం కూడా ఉండదు...ఇక వెళ్ళు—ఇప్పటికే నీవు వచ్చి గంటకుపైగా అయింది' ... తప్పు చేస్తూన్నట్లు ఆమె కంఠం భయపడ సాగింది.

'వెళ్తానులే...ఇంకొక ఐదునిముషాలు...' ప్రాధేయపూర్వకంగా అడిగాడు.

'నీవు వచ్చినప్పటినుండి ... ఈలాటి 'ఐదు'లు ఎన్నయిపొయ్యాయో—'ప్లీజ్'—నన్ను బాధించకు ... ఇకవెళ్ళు' ... నొసలు కొట్టుకొంది.

'లేకపోతే నేనేపోతా ... పోనా?' అంటూ బెదిరిస్తూన్న చూపులతో తలుపువైపు నడవసాగింది.

వెళ్తూన్న ఆమె చీరె చెరగు పట్టుకొని లాగుతూ 'నేనే వెళ్తాను—రా'—అతనన్నాడు.

ఆమె వాలిపోతూన్న చీరె చెరగును వక్షఃస్థలంపై సరిగా కప్పుకొంటూ. 'అబ్బ—వదులు—అరే...బయటవాళ్ళంటే ... ఎంతసేపు నా కెదురుగ్గా కూర్చొని చూస్తే తనివి తీరుతుందో నా కర్థంకాదు ... ఎంతసేపు నా కెదురుగా కూర్చుంటేమాత్రం ఏముంది నాలో...రోజూలాటి శారదనేనా?... నాలో మార్పు ఏమైనా ఉందా? ... లే—వెళ్ళు ... వెళ్ళవా!' ... బతిమాలుతూన్న కంఠంతో మెల్లగా అంది.

అతను అయిష్టంగా లేచాడు. ఒళ్ళు విరుచుకొన్నాడు.

బజారుకేసి చూశాడు — చూపు కంది నంతలో ఎవరూ కనబడలేదు. మళ్ళీ అసనాటుగా తలుపు చెక్కపై వాలాడు. తల వంచుకొని పంట్లాం రెండు జేబుల్లోనూ చేతులు పెట్టుకొని ఓ నిముషం ఆలోచించాడు.

'నీది చాలా, రాతిగుండె శారదా!...నన్ను చూడకుండ నీవెలా ఉండగల్గుతున్నావ్... అవును—నీవుండగలవు... నేనే ఉండలేను... ఇది నా హృదయ దౌర్బల్యం కావచ్చు...నేను నిన్ను చూశయినా ఈ నిగ్రహం అలవర్చుకోవాలనుకొన్నాను చాలాసార్లు. కానీ సాధ్యపడలేదు ... నీవు రెండుమూడురోజులకొకసారివచ్చి కనిపించి పొమ్మన్నావా ? ... కానీ రోజుకి రెండుమూడుసార్లు చూడాలనే బుద్ధి పుడుతుంది ... వచ్చాక 'పో'బుద్ధికాదు...ఏం చెయ్యను? ... సరే శారదా? అసలిక్కడకు రాకుండ ఉండటానికే ప్రయత్నం చేస్తాను... అంటూ గడపదాటినవాడు మళ్ళీ ఆగిపొయ్యాడు. కళ్ళు దీనంగా చూస్తున్నాయి.

'ఒక్కమాట' ... యుద్ధవిరమణరేఖను దాటిస్తూన్న సైనికుడిలా అక్కడే నిలబడి అడిగాడు.

'ఒక్కమాట — ఒక్కమాటంటూ నేను పొమ్మన్నప్పటినుండి ఎన్నిమాటలు చెప్పావ్!... నేనేవీ వినదల్చుకోలేదు పో ... మా నాన్నగారూ ప్రసాద్—వచ్చేవేళయిందనిచెప్పానా?... వాళ్ళు వచ్చేప్పటికీ మనిద్దరమూ ఏకాంతంగా ఈ గదిలో మాట్లాడుకొంటూంటే — ఏమనుకొంటారు? ... ఇప్పటికే రెండుసార్లు



వాళ్ళ కళ్ళల్లో పడ్డాం ... ఇవ్వాళకూడ చూశారంటే ఖచ్చితంగా అనుమానపడ తారు...వెళ్ళు...'ఆమె అటుతిరిగి సమాధాన మిచ్చింది.

'ఎవరు అనుమానపడతారంటావ్... ప్రసాదా?'

'ప్రసాదా!...పిచ్చివాడు...అతనేమీ పట్టించుకోడు...అమృత హృదయం—అసూయ—అనుమానం ఏకోశానా కన్పించవ్ ...ఇంకా నేనే తప్పు చేస్తున్నాననే భావం లోలోన ఉండటాన అతనితో మనసు విప్పి మాట్లాడలేక—దకార దూరంగా తిరుగు తున్నాను'...ఆమె కన్నుల ఎదుట అతని మూర్తి కనిపించినట్లు ఆమె కన్నుల్లో ఒక రకమైన గౌరభావం తళుక్కుమంది.

'ఏమో...నేను నమ్మను...శారదా...అతను విగూఢమైన మనిషి...మరి పరీక్షలు ఎలా పోయ్యాయి—అతను శ్రద్ధగా చదువుకొనే వాడేగా...'

'అవును...ఆమాట కూడ నిజమే కావచ్చు ...అమె ఆలోచించి ఒక నిర్ణయాని కొచ్చింది'......'అయినా ప్రసాద్‌ను గూర్చి నేనేమీ భయపడటంలేదు.' అమె అంది.

'మరి మీ నాన్నగారినిగూర్చి'

'అవును...ఆయన దిగులుతో కృంగి పోతున్నాడు — మీ మామయ్య కారణంగా అందరిమీదా, చిరాకుపడుతున్నాడు. ఉద్యోగం పోయిందనీ—డబ్బు తిన్నాడని నిందలు వేశా రనీ—ఆయన అభిమానంతో చచ్చిపోతు న్నాడు....ఇక ఈ అనుమానం కూడ కల్గిం

# 'మట్టి బొమ్మలు'

దంటే నిన్ను మా ఇంటి ఛాయలకే రాని వ్వడు...వెళ్ళు...వెళ్ళు...త్వరగా'...

'మీ నాన్న నీవు చెప్పినట్లు అనుమాన పోరు—నిజం శారదా—నమ్ము—వారి సంగతి మనకు తెలియదా?,..ఆ అనుమానం రాకుండా నేనే ముందుగా మీకోసం వచ్చానని ఎదు రెళ్ళి ఆహ్వానిస్తాను...ఇక దానితో ఏ అను మానమూ ఉండదు...అయినా ఇంకొకటి... భానూ...భాస్కర్—బయట ఆడుకొంటున్నా రుగా...ఇంకెలా అనుమానపడతారు.' అన్నాడు బయటికి చెవులు దొరపెట్టుకొని.

'మాష్టర్ని రానివ్వు...చెప్పక పోతే చూడు'—భాస్కర్ కసిగా అన్నాడు.

'చెప్పుకో—చెప్పుకో...నాకేమైనా భయమా!'... ఆడుకొంటూన్న తాళ్ళు బలంగా గచ్చుపై విసిరిన చప్పుడు.

'ఛీ...ఛీ...ఏం మనిషివి నీవు...నేనే లేచి పోతానంటూ'...శారద లేచి చరచరా గది దాటింది.

'నేను పోతున్నా...ఒక్కసారి ఇలా లోపలికి రా'...వెలుగు సరిగా సోకని ఆ 'టేబిల్' ముందు నిలబడి, ఆమెను కళ్ళతో తాగేస్తూ తన్మయత్వంతో మునకలువేస్తూ పిలిచాడు.

'మధూ...నీకు మరొక్కసారి చెబు తున్నా...అలా అయితే మాయింటికే రాకు... నాకు తెలుసు నీవు మనసు నిగ్రహించుకో లేవని...దయచేసి వెళ్ళ'ని మధ్య హాలునుండి వసారాలోకి వచ్చింది.

గుండెలు గుభిల్లుమన్నాయి. తండ్రి చెప్పులు పంచలో ఉన్నాయి. ఆయన బావి వద్ద కాళ్ళు కడుక్కోటానికై ధోవతి కుచ్చిళ్ళు పైకెత్తుకొని నిలబడ్డాడు. ప్రసాద్ నీళ్ళు తోడుతున్నాడు. తన మాటలు తండ్రి విని-విననట్లు మౌనంగా బావివద్ద కెళ్ళాడేమోనని శరీరమంతా కంపించసాగింది. తాను ఏది జరగకూడదని కోరుతున్నదో అదే సంభవించింది. బయట వాన చినుకు లాగిపొయ్యాయి. ఆడుకొం టూన్న పిల్లలు లేరు. భానూ—భాస్కర్ ఎటో వెళ్ళారు—అంతా నిర్మానుష్యం—కళ్ళ వెంట నీళ్ళు తిరిగాయి. తండ్రిని ఆహ్వా నించటానికి ముఖం చెల్లక — పెద్దగా నిట్టూర్పువిడిచి, కాళ్ళీడ్చుకొంటూ వెనకి గదిలోకెళ్ళి 'పొయ్యి' ముందు కూర్చుంది.

'మధు పేపరు చూస్తూ కాళ్ళు 'టీపాయ్' మీద పారేశాడు తనవి కాదన్నట్లు.

*   *   *

ఒక్క సంవత్సరంలోనే కామయ్యగారి ముఖంలో జీవకళలు ఉడిగి పొయ్యాయి. ముఖం ముడుతలుతేలి వృద్ధాప్యం తొంగి చూడసాగింది. దవడలు పూర్తిగా లోపలకు పొయ్యాయి—గుంటలు పడిపోయిన ఆగాజా కళ్ళలో—వారి అంతర్వేదన— కలివరపాటూ కనిపిస్తాయి.

ఆయనలో ఇదివరకులా ప్రశాంత చిత్తం—గంభీరతా లేవు. ఏదో చెప్పలేని దిగులు మనిషిని కొరుక్కు తింటున్నట్లు చిక్కి సగమైపొయ్యాడు.

దాదాపు ఆ ఊళ్ళో అందరితోనూ చెప్పాడు—'పైకి అప్పీలుచేసి నీళ్ళ అంతు తేలుస్తా'నని'...

అమాట చెప్పటమేగాని, ఆయన తిరిగా కూర్చొని ఓపిగ్గా ఒక దరఖాస్తు వ్రాసి పైకి పంపిన పాపాన పోలేదు. కనీసం ఏ విద్యా శాఖాధికారివద్దకైనా వెళ్ళి కాళ్ళమీదపడి కళ్ళనీళ్ళు పెట్టుకోలేదు. అలావెళ్ళి ఇతరుల సహాయాన్ని అర్థించటమంటే తీవ్ర అభి మానంతో చచ్చిపొయ్యేవాడు.

'కోర్టుకు లాగుతా'నన్నాడు కొన్నాళ్ళు.

కోర్టుకు లాగటానికి ఆ స్కూల్లో తను శాశ్వత ఉపాధ్యాయుడైనట్లు ధృవ పత్రాలు లేవు. అసలు ఈలాంటి పరిస్థితులు తలెత్తుతాయని అయనెప్పుడూ ఊహించ లేదు. అలాటి అక్షరం కాగితం అవసరమని



## రోజంతా హాయిగా, తాజాగా ఉండుటకు...

# పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్

పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ కుటుంబములో చిన్నా పెద్దా అందరూ వాడుకోవచ్చును. [illegible] దీని పౌడరు మెత్తగా ఉంటుంది, ఉపశమనము కలిగిస్తుంది. చెమటను త్వరగా పీలుస్తుంది. ఇది మండే ఎండలలో, ఉక్కపోసే వాతావరణములో వాడుటకు దివ్యముగా ఉంటుంది. పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కమ్ దాని తేలికైన పరిమళముతో రోజంతా తాజాగా ఉంచుతుంది.






అందరికీ అందుబాటైన,
తేలిక పరిమళముగల
టాల్కమ్ పౌడరు

చెస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఏ లో స్థాపించబడినది)

# మట్టిబొమ్మలు

కూడ ఆయనకు లోగడ అనిపించలేదు.

పైగా—కోర్టంటే మాటలా?... డబ్బు పొయ్యాలి.

ఆయనచేతిలో చిల్లిగవ్వలేదు. — సగం కూతురు కాలేజీ చదువులకు ఖర్చయిపోయింది — సగం నీతికి నిలబడినందుకు హరించుకుపోయింది. కొద్దోగొప్పోమిగిలితే—దానితోనే ఉద్యోగం పోయిననాటినుండి పస్తులు పడుకోకుండా కాలం వెళ్ళదీస్తున్నాడు.

'అయ్యో ... కామయ్యగారికి ఉద్యోగం పోయిందంట—పాపం' అని అందరూ సానుభూతిచూపేవాళ్ళేఅయినా— ఆర్థికంగా కానీ సలహారూపేణాగానీ ఏవరూ ఆదుకోలేదు.

వృద్ధాప్యంలో విరుచుకుపడ్డ ఈ కష్టాలతో— బాధలతో మనస్సు అలిసిపోయింది. ఆయన ప్రతిటికీ మాటికీ చిరాకు పడిపోతున్నాడు. ఒక్కొక్కసారి కోపంతో అందరినీ తిట్టిపోస్తున్నాడు.— ఒక్కొక్కసారి పిలిచినా పలక్కుండా చుట్టూ ఆయన సర్టిఫికేట్లూ— ఉద్యోగానికి సంబంధించిన కాగితాలూ. యోగ్యతాపత్రాలూ పరచుకొని—చదువుకొని మళ్ళీ వాటిని దాచుకొనేవాడు.

ఆవేళ సాయంత్రం 'మధు' నమస్కారం చేసినా లెక్కచెయ్యకుండ అదే కార్యక్రమం మొదలెట్టాడు.

కాగితాల కట్టలను మళ్ళీ విప్పి ముందు పెట్టుకొన్నాడు. ఏదో కవరు పైకి వచ్చింది. దానిపై చిరునామా చదివాడు— రెండు సంవత్సరాలనాడు మృత్యుశయ్యమీదున్న మిత్రుడు స్ఫురణకొచ్చాడు— అది స్వర్గీయ వెంకట్రామయ్య వ్రాసింది.

ఉత్తరాలన్నిటినీ దుకాణంలా ఇల్లంతా పరిచి ఆ ఒక్క కవరునే చేతోపట్టుకొని లేచాడు—మడతకుర్చీ కిటికీదగ్గరగా లాక్కున్నాడు. కవరు చించి చదవసాగాడు.

కామయ్యగారూ!

మీ సహచర్యంతో నేను ఎన్నో విషయాలు నేర్చుకొన్నాను మాష్టారూ. మానవ కళ్యాణంకోసం ఎందరో మహానుభావులు తమ జీవితాలను ఆహుతి చేసికొన్నారు. వారి వలననే దేశాలూ ప్రపంచం ముందుకు సాగుతోంది. అయితే కొందరిపేర్లు మాత్రమే చరిత్ర జ్ఞాపకం పెట్టుకొంది...కానీ వాళ్ళు కాల్చిన వెలుగులు మాత్రం మహోజ్జ్వలంగా మానవులకు నీడ కల్పిస్తున్నాయి.

మీలాంటి ఈ కోవకు చెందినవాళ్ళు— విస్మృలను ఈ ఊరి చరిత్ర స్మరించకపోయినా మీరు పెట్టిన దీపాలు వెలుగుతూనే ఉంటాయి—ప్రకాశవంతంగా.

ఇదివరకు రోజుల్లో ధర్మాత్ములైన ధనికులు—పుణ్యంకోసమే సత్రాలు కట్టించేవాళ్ళు—పేదా, సాదా, ముష్టివాళ్ళూ— ఆశ్రయహీనులూ అందరూ తల దాచుకోటానికి ఇంత నీడ కల్పించేవాళ్ళు—కొందరు బావులు తవ్వించేవాళ్ళు కొందరు అన్నదానాలు చేసేవారు...

ఇవన్నీ—ఎవరు చేస్తారు,......డబ్బున్నవాళ్ళు

ఎందుకు చేస్తారు?...పుణ్యంకోసం.

పుణ్యం సంపాదించుకోవాలి—చావటానికి ముందు—ఎన్నో పాపాలు చేసి కూడబెట్టిన డబ్బుకు పరిహారంగా పుణ్యం సంపాదిస్తారు. మోసం, అన్యాయం అధర్మం మనిషిని తాత్కాలికంగా జయిస్తాయి. సంతోషపెడతాయి. కానీ చిరకాలం ఆ సంతోషం ఉండదు. అతని హృదయమంతా దుఃఖం ఆకట్టుకొంటుంది. అతని చర్యలతో అతనే నమగెత్తి కొన్ని సత్కార్యాలు చెయ్యటానికి నిం కల్పించుకొంటాడు. వాటివలన ఏదో పుణ్యం వస్తుందని మనసును సరిపెట్టుకొంటాడు. చివరకు ఆ పుణ్యానికి విలువ కట్టి పాపాలతో తేరీజువేసి, కొన్ని పాపాలను 'మైనస్' చేస్తారో—లేదో—నాకు తెలియదు.

కానీ మనిషి అనుభవించే ఈ భావసంఘర్షణలోనుండే — వైరాగ్యం, వైరాశ్యం— పుట్టుకొస్తాయి. వాటిల్లోనుండే —దేవుడూ— గుళ్ళూ — గోపురాలూ—మతం— పురాణాలూ ఇత్యాదులు పుట్టుకొస్తాయని నే నను కొంటాను.

నేనూ ఈ పాపభీతికల్గినవాడినే — కానీ నేను పుణ్యంకోసంకాదు. మీరు ఆవేళ సమావేశాల్లో — నా ఔదార్యాన్ని గూర్చి— నేను ఈ ఊరికిచేసిన మహోత్కృష్టమైన సేవను గూర్చి—పదేపదే ప్రశంసిస్తుండేవారు, ఎప్పుడూ మీరు నన్నొక అసాధారణ వ్యక్తిగానే చూసేవారు. ఇదంతా నిస్వార్థమైన సేవనిదురభిప్రాయపడటమే నన్ను ఈఉత్తరం వ్రాయటానికి పురికొల్పుతోంది.

ఈ ప్రజాహితకార్యక్రమాలలో నేనెందుకు

అందుకొన్నాను. ఊరికోసం కాదు—నాకోసం—నన్ను నేను మరచిపోవటంకోసం—అంతే.

నేను ఈ ఊరి అల్లుడుగా రాకపూర్వం మూడు సంవత్సరాలు వ్యాపార నిమిత్తమై మద్రాసులో ఉన్నాను.

అప్పటిలో మానాన్న నీలిమందు వ్యాపారం చేస్తూండేవాడు. ఆ నీలిమందు అమ్మకం నిమిత్తమై నన్ను వినియోగించాడు. అక్కడ నీలిమందు నిల్వలకోసమై ఒక పెద్ద ఇల్లు అద్దెకు తీసికొన్నాం. ఆ ఇంటివాళ్ళు కూడ ప్రక్కవాటాల్లో, చిన్నగదుల్లో ఉండేవారు. అంటే వాళ్ళు ఎంతోమందిలేరు. విధవ—తల్లి—ఆమె కూతురు—నా భోజనం—బస వాళ్ళవద్దనే.

ఆ అమ్మాయి పుత్తడిబొమ్మ. పేరు స్వరాజ్యలక్ష్మి. ఎర్రగా బొద్దుగా ఉండేది. ఆ అమ్మాయి కళ్ళు ఒక్కసారి చూస్తే మరచిపోలేం — వయసు కుమించిన గంభీరత, నిండుదనం ... అణకువ తనలో కనిపించేవి.

ఆమెతల్లి చాలా మర్యాదస్తురాలు, పాత తరపు మనిషి. నాకు భోజనం వడ్డించి తలుపుకు ఆనుకొని నిలబడి ఆ అమ్మాయిని గూర్చి మాట్లాడుతుండేది. 'నాకు మా స్వరాజ్యానిదే దిగులు నాయనా...ఈడొచ్చిన పిల్లను ఇంట్లో ఉంచుకోవటం ఎంత భారమో నీకు తెలియదా!—నాకు వెనకా ముందు ఎవరూలేరు నాయనా! ఇప్పటి కయితే ఈ అద్దెతో ఎలానో జీవితం వెళ్ళబుచ్చుతున్నాం...ఇక దాన్ని ఒక ఇంటి దాన్ని చేసి సాగనంపటమంటే మాటలతో పనా! కనీసం కట్నం—అదీ—ఇదీ కలిపి ఒక పదివేలయినా కుప్ప పోసికొని కూర్చుంటేగానీ మంచి సంబంధంరాదు... అందుకే ఈ ఇల్లమ్మి అయినా అది కాస్తా అయిందనిపించు కొందామంటే ... ఈ వ్యవహారాలు చూసే మగదిక్కులేదు. ఆడ దానిని...ఏం చెయ్యాలో పాలుపోక రెండు సంవత్సరాలనుండి కుమిలి చస్తున్నానంటే నమ్ము నాయనా!' అంటూండేది.

అప్పుడప్పుడు మాటలు మారినా భావం మాత్రం అలానే ఉండేది. తన కూతురిని చేసికొంటే ఆ ఇల్లు నాకే వస్తుందని నీలి మందు వ్యాపారం నిరాటంకంగా సాగు తుందని ఆమె మాటల్లోని అంతరార్థ మేమోనని మొదట్లో భావించాను. కాని తరువాత తరువాత నా అభిప్రాయం తప్పని

గ్రహించాను, ఎందుకంటే ఆ అమ్మాయిని నేను ఏదో వంకతో పలకరించటంగానీ, ఏదో పని ఉన్నట్లు వెనక గదులవైపుగా పెరటివైపుగా నడిచినప్పుడు—ఆమె నా చర్యలను తీవ్రంగా గర్హించేది. అప్పటినుండి ఆమెగోడు వినిపించుకొనే మగ దిక్కు లేకనే నాకు చెప్పుకొంటుందని గ్రహించి నా ప్రవర్తన మార్చుకొన్నాను. ఆమెమాటలకు 'ఊఁ' కొట్టటంమినహా పల్లెత్తి ఓమాట ఆ అమ్మాయిని గూర్చి పలికేవాణ్ని కాదు.

నాలోకల్గిన ఈ మార్పు ఆమెలో ఒక కొత్తభావం కల్గించింది. నేను నిరపాయకరమైన మనిషిననీ—అల్లరి చిల్లరిపనులు చేసే రకంకాదనీ అభిప్రాయపడసాగింది. అప్పటినుండి నాపట్ల ప్రేమాభిమానాలు ఎక్కువగా చూపసాగింది. ఆ సంగతి పసిగట్టి నేను ఇంకా అమాయకునిలా ప్రవర్తించసాగాను. ఎప్పుడైనా ఆకస్మాత్తుగా పంచపాళీలోగానీ, పెరటిబావివద్దగానీ ఆ పిల్ల నన్నుచూసి విసవిసా లోనికి పరుగెత్తితే 'కొత్తవాడటే ... అలా పరిగెత్తటానికి—ఫర్వాలేద'నేవరకూ ఆమెవెళ్లింది. రానురాను ఆమెలో ఇంకా మార్పులు కలిగాయి. ఆమె పురాణకాలక్షేపానికి వెళ్ళినప్పుడుకానీ— లేక పని చెయ్యలేక పొలుమారినప్పుడు గానీ ఆ అమ్మాయికే, నాకు నీళ్లు పెట్టమనీ—భోజనం వడ్డించమనీ — పనులు పురమాయించేది.

గదిలో వెలుగుతగ్గిపోయి చీకట్లు వ్యాపించసాగాయి. బయట చెట్లమీద పిచ్చుకలు గుంపులు గుంపులుగాచేరి అరుస్తున్నాయి. ఇల్లంతా నిశబ్దంగా ఉంది.

మాష్టారులేచి కిటికీవద్ద నిలబడి చదువుకోసాగాడు.

'అయితే ఆ అమ్మాయి కన్నెత్తిచూడటంగానీ, వెకిలిగా నవ్వటంగానీ—ఏదో సాకుతో విస్తరించి మాట్లాడటంగానీ ఏమీలేవు. వయసులో ఉండే చాంచల్యం అసలేలేదు. వడ్డనప్పుడు కూడ నేను తనను పలకరించే అవకాశమివ్వకుండ కావలసినవన్నీ వరసవరసనే సమకూర్చుతూండేది. తొణకని నిండుకుండలా ఉండే తనను చూసి నేను లోలోన కుతకుతలాడి పొయ్యేవాణ్ణి. అందగత్తెననే అహంకారమని సంకుచితంగా ఆలోచించేవాణ్ని. అనవసరంగా అప్రస్తుతంగా తనను పలకరించేవాణ్ని.

## మట్టి బొమ్మలు

అర్థంలేని నా వెర్రి ప్రశ్నలకు తను రెచ్చిపోయి తిరస్కారభావంతో సమాధానమిస్తుందని— అప్పుడు నేను పగలబడినవ్వి అవమానించాలని ఎంతగానో కోరుకొనేవాణ్ని. కానీ నా ఊహలకు పూర్తిగా విరుద్ధంగా జరిగింది.

నా కాఠిన్యతకు ఆమెచూపినకరుణ నన్ను వేధించింది. అన్ని వెకిలిమాటలనూ సహించి ఊరుకుండేది. అపారమైన ఆమె దయలో నేను కరిగిపోవాల్సి వచ్చింది. వయస్సులో చిన్నదైనప్పటికీ ఆమె ప్రదర్శించిన ఉన్నత సంస్కారం—నాకు సిగ్గుని కలిగించింది.

ఆమె, మూర్తీభవించిన సౌందర్యం—సౌకుమార్యం — సౌజన్యం — సౌశీల్యం నా వెకిలిచేష్టలకు నాకే సిగ్గనిపించి ఆమెకు దూరంగా తప్పుక తిరిగేవాణ్ణి. కానీ దూరం కావాలని మనసు ఎంత ప్రయత్నం చేసేదో అంత సన్నిహితంగా ఉండేది. మనసు ఇంకా ఎక్కువగా తనను గూర్చి ఆలోచించేది.

రోజులు గడిచినకొద్దీ వాళ్ళ అమ్మస్థానే తనే నా అవసరాలను చూడసాగింది. ఆ సన్నిహితత్వంవలన కోర్కెలు భయంకరంగా పడగలెత్తాయి. కానీ మనసును అదుపులో పెట్టుకొని ప్రవర్తించేవాణ్ని—కానీ నా ఆత్మసంయమనం కృత్రిమమైనది కావటంవలన సూర్యరశ్మివలన కరిగిపొయ్యేమంచులా విడిపోయింది. ఆ ఇంటిలో మేమిద్దరమూ—ఆమెతల్లి — భయంకరమైన ఏకాంతం. కోర్కెలను రెచ్చగొట్టి యుక్తాయుక్త జ్ఞానాన్ని పారదోలే అనుకూలత! ఒకనాటి రాత్రి నేను చేసిన అఘాయిత్యం ఆమె నిరోధించలేకపోయింది. నానుండి తప్పించుకోటానికి తను ఎంతో పెనుగులాడి విఫలురాలైపోయింది.

(ఇంకా వుంది)



# భూతమూ – రాముడూ

Jayadev...
బొమ్మల కథ

అనగ అనగా ఓ భూతం



ఓ రోజు ఆ భూతానికి తుమ్మువచ్చింది అక్కడ తపస్సు చేసుకుంటున్న ఓ ముని ఆ తుమ్ముకు ఎగిరి కిందపడి నడ్డి విరుచుకున్నాడు



మునికి అమాంతం భూతం మీద కోపం వచ్చింది





అని భూతాన్ని ఓ జాడీ లో బంధించి పక్కన కాలవలో పారేసి చక్కా పోయాడు



కొన్ని వందల సంవత్సరాలు గడిచాయి!

ఓ రోజు ఎండిపోయిన ఏలూరు కాలవలో ........









రాముడూ వాళ్ళమ్మా జాడీని ఇంటికి తీసుకువచ్చి మూత తీయడానికి ప్రయత్నించారు – కాసేపు కష్టపడ్డాక మూత వూడింది





జాడీ లోంచి పొగ పైకి లేచింది అందులోంచి భూతం బైటికి వచ్చాడు









కాదు కాదు ఆ భూతం వేరు నేను వేరు – వాడు నా మేనమామ కొడుకు














అంతవన్నీ చెబుతూ నదికోరుకుంటూ పండించినా పండనిదీ కొండా మన్నా దొరకనిదీ .......
బాబోయ్ ఇదేదో పొడుపు కధలా వుందే
బియ్యం బియ్యం కరెక్టే మావా!
జై ను భూతం! మాకు బియ్యం కావాలి - తెచ్చివ్వగలవా - వరన్నం తిని
అలాగే క్షణంలో పట్టుకొస్తా
అంటూ భూతం మాయమైంది!


ఆరోజు రాత్రి రాముడూ వాళ్ళమ్మా అన్నం వండి కడుపు నిండా తిన్నారు
అమ్మా ఇవాల్టించి నన్ను రేషన్ షాపుకు పంపవు కదూ
మర్నాడు పొద్దున్న రామూకు ఓ కోరిక కలిగింది
కాఫీ తాగాలనుందమ్మా బడ్జెట్ తర్వాత కాఫీ ఇవ్వడం మానేశావ్
సరే భూతాన్నడుగుదాం కాఫీ పట్రమ్మని
భూతం కాఫీ కూడా పట్టుకొచ్చి ఇచ్చింది ముగ్గురూ కాఫీ తాగారు
భలేగా వుందే ఈ పానీయం!
భూతం వచ్చాక .... రాముడు వాళ్ళింట్లో మూడు పూటలు భోజనమూ ఆరు పూటలు కాఫీలుగ గడిచిపోతున్నై ఇలా వుండగా...


ఆ వూళ్ళో ఓ పెదమనిషి వున్నాడు - ఆయనకి ఇనప్పెట్టెలు సోఫాలు పరుపు క్రింద రూపాయనోట్లున్నై - పైగా భూగర్భంలో గదుల్నిండా చక్కెర బస్తాలు బియ్యం బస్తాలూ పాలపిండి టిన్నులూను
బాబూ ఇనకంటాక్సు వాళ్ళెళ్ళి పోయారు బైటికి రండి
చీటికీ మాటికీ వీళ్ళగోల ఒకటి పావలానో పరకానో ఇస్తే పుచ్చుకోరూ
ఒరేయ్ వెంకన్నా - ఇల్లు జాగర్త - పనుండి కొండకి వెళుతున్నా!


పెద్దమనిషి మెట్లు దిగి క్రింద చీకటి గదిలోకి వొచ్చాడు - బస్తాలు లెక్క పెట్టేనికి
ఏడువందలమూడూ నాలుగూ ... ఏడు బస్తాలేమైనట్లూ
పెద్దమనిషి చకచకమని పైకి వచ్చాడు -
ఏరా నౌకరు వెధవా నాయింటు ఉప్పు తింటం చాలక పైగా బియ్యమూ చక్కెరా తింటున్నావుట్రా ఉండు నిన్ను... నిన్ను.. పోలీసు
ఆ తర్వాత పెద్దమనిషికి మాటలు పెగల్లా - వాళ్ళంటే ఆయనకి చచ్చేంత భయం -
నన్నాళ్ళకి పట్టిస్తే మీ బండారం బైట పడుద్ది!

ఇహీహీ వెంకన్నా అమాంతం కలా అన్నారు పోమ్మా పో- నీపని జూసుకో

ఈ వెధవే కాజేసుకుంటాడు ఇహా మన కొంప్పే లాభాల్లో ఇలా నలభై ఏడు బస్తాలు ఇక లెక్కెట్?

ఇహా మీదంచి బస్తాలు మాయ మవుతుండం చూడాలి - ఈ రోజు నుంచి మన బస చీకటిగదిలో

పెద్దమనిషి చీకటిగదిలో చేరాడు

ఇక్కడం రాముడింట్లో.....

ఇలాగే భూతం మళ్ళీ బియ్యం గోధుమలూ చక్కెర ఎక్కడున్నంచి తెస్తున్నావ్? అమెరికా నుంచా?

అబ్బే అందర్నీ ఎందుకు ఈ వూళ్ళోనే ఓ బాబు ఉంది!

నాకా బూతాలు చూపించవా?

భూతం రాముణ్ణి ఎత్తుకుని పెద్ద మనిషి ఇంటికి వొచ్చింది అక్కడ చీకటి గదిలో....

చూశావా ఇక్కడ ఎంత ధాన్యం వుందో!

అమ్మ బాబోయ్

పెద్దమనిషికి వీళ్ళ మాటలు విన్నాయ్

ఎవర్రా అక్కడ ఆఁ ఆఁ

వీడా! వీడు పచ్చి దొంగ వెధవని అమ్మ చెబుతూంటుంది - బియ్యమూ గోధుమలు రహస్యంగ ఎక్కువ ధరకి అమ్ముతుంటాడు వీడు

అలాగా వీడి పని పడదామా?

భూతాన్ని చూడంగానే పెద్ద మనిషి గుండెలవిసి పోయినై

బాబోయ్ భూ..భూ

భూతం పెద్ద మనిషిని చితక బాదింది

ఈ లోగా రాముడు పైకి గదిలోకొచ్చి

హాలో పోలీసు ఇనస్పెక్టరా నమస్తే మీరు వెంటనే ఇక్కడికి రావాలి

కాసేపట్లో పోలీసు వాళ్ళొచ్చారు

ఊళ్ళో జనం తిండి లేక చస్తుంటే ఈ వెధవ ఎంత అన్యాయం చేస్తున్నాడో చూశారా

ఇలాంటి నీచుణ్ణి మాకు పట్టించినందుకు చాలా థాంక్స్

మీరు మంచి పని చేసినందుకు మీకు ప్రభుత్వం రివార్డు ఇస్తుంది వస్తా.....

అంటూ పోలీసు అధికారి పెదమనిషినీ వాడి నౌకరునీ ఖైదు చేసి తీసుకెళ్ళిపోయారు

భలే భలే మంచి శాస్తి జరిగింది ఇహ నుంచి వీడి పీడ విరగడైంది

భూతమూ రాముడూ ఇంకా ఇలాంటి వాళ్ళని పట్టుకోవాలని తిరుగుతున్నారు! రేపో మాపో మీవూరికి వస్తారు!! వాళ్ళకి సహాయం చేస్తారు కదూ.




# బాల్యమిత్రుడు హఠాత్తుగా కలిస్తే...!

'సుమిత్రుడు'

చిన్న పిల్లల్ని చూస్తున్నప్పుడు, వాళ్లు చేసే పనుల్ని చూస్తున్నప్పుడు ఒకోమారు తలవని తలంపుగా మన పెదవుల మీద చిరునవ్వు తొణికిస లాడుతుంటుంది.

మనసు ఒక్కోసారి చిన్న వయసులోకి వెళ్ళిపోయి ఆనాటి తన ప్రవర్తనను జ్ఞాపకం చేసుకుంటుంది. తరచు ఇలాంటివి మనకు అనుభవ మవుతూనే వుంటాయి.

ఎదిగిన మనస్సుకి, ఆవాడు తను అలా ఎలా చేయగలిగానా? అనిపిస్తుంది. ఎలా ప్రవర్తించ గలిగానా? అనిపిస్తుంది. సిగ్గు వేస్తుంది. ఆనందం కలుగుతుంది. అన్నీ మిళితమైన నవ్వూ వస్తుంది.

చిన్ననాటి స్మృతి తేనెలాంటిది. దాని అనుభూతి ఎంతో తియ్యగా వుంటుంది.

బాల్యమిత్రులు ఒకచోట కూడినప్పుడు, బాల్యంలో వారి కార్యకలాపాల గురించి తప్పకుండా ప్రస్తావించుకుంటారు. లోపాల నెంచుకుని ఎద్దేవా చేసుకోవడం, లేదా పొగుడుకోవడం ఉంటుంది. అయితే, ఒకరి నొకరు బాగా ఎరిగి వున్న వారు గనక గొప్పలు చెప్పుకోరు. సహజమైన సంగతుల్నే హృదయంగమంగా నెమరువేసు కుంటారు.

కొత్త మిత్రుల్ని కలుసుకున్నప్పుడు గోరంతలు కొండంతలుగా చెప్పుకోవడం కొందరి తరహా.

'మా చిన్నతనంలో అయితేనా...' అంటూ స్కూల్లో తమ ఆధిక్యత గురించి, ఆటల్లో మేటితనాన్ని గురించి, అల్లర్లలో పెద్దచెయ్యి గురించి, వూరికే కోతలు కోసేస్తూ వుంటారు.

ఎదుటి వాళ్ళు ఎంతవరకు నమ్ము తున్నారు, అసలు వింటున్నారా లేదా అనే జ్ఞానం కూడా ఉండదు. వారి ధోరణే వారిది. శ్రోతలు ఒకరికి నలుగురైనప్పుడు వాళ్ళ ఉత్సాహం మరీ ద్విగుణీకృతమై పోతుంది.

బాలబాలికల మధ్య స్నేహం వాళ్ళు పెద్దవాళ్ళయింతర్వాత ఎలా వుంటుందో చెప్పడం కష్టం. వారి మధ్య చిన్నప్పు డున్న పరిచయాన్నిబట్టి, పెద్దయినతర్వాత రెండు కుటుంబాల సంబంధ బాంధవ్యాలని బట్టి వారి సాన్నిహిత్యం ఆధారపడి వుంటుంది. ఏమైనా, స్త్రీ పురుషుల మధ్య బాల్యస్నేహం అంతగా బహిర్గతం కాదనే చెప్పాలి. మనసులో ఎక్కువగానే వుండొచ్చు! బాల్యాన్ని ముచ్చటించుకొనేం దుకు తగిన వాతావరణం వారికి ఎక్కువగా ఉండదు. భవులికమైన మార్పులు, కట్టు బొట్టు, ఆచార వ్యవహారాలు వారిని కొంచెం అదుపులో వుంచుతాయి. వాటిని అధిగమించే డానికి చేసే ప్రయత్నాలు ఇప్పుడిప్పుడు చాల వరకు ఫలిస్తున్నాయి.

మనిషి పెరుగుతున్నాడు. మనస్సు ఎదుగుతున్నది. జరిగిపోయిన కాలమంతా బంగారుమయంలాగే కన్పిస్తుంది. దానిని తలచుకున్నప్పుడు అనిర్వచనీయమైన ఆనందం లభిస్తుంది. ఒకోసారి, చెయిజారి పోయిన అవకాశాన్ని జ్ఞాపకం చేసుకుని విచారించడం కూడా వుంటుంది. ఆనంద మయినా, బాధ అయినా ఏదయినా గతాన్ని గురించిన స్మృతుల్లో చక్కని అనుభవాలే దొరుకుతుంది.

చిన్నప్పుడు బాగా అనుభవించినవాళ్ళు పెద్దయ్యాక లేనివారు కావొచ్చును. అప్పుడు లేనివారు ఇప్పుడు బాగా ఉన్న వాళ్ళు కావొచ్చును. బళ్ళు ఓడలుగాను ఓడలు బళ్ళుగాను మారవొచ్చును. మరి అలాంటప్పుడు చిన్ననాటి అనుభూతులు 'అందరికీ సమానంగానే వుంటాయా ?

కష్టసుఖాలు కావడి కుండలు అన్నారు. అందుచేత ఉన్నవాళ్ళు లేనివాళ్ళు అనే ప్రసక్తి లేకుండా, ఒక విధంగా ఈ కావడి కుండల్ని మోస్తూనే వుంటారని పలువురి అభిప్రాయం.

మరీ ఉన్నత వంశానికి చెందిన వారున్నారు. వారి బాల్యచరిత్ర అందరిలా వుండదు,

# హఠాత్తుగా...

**ఇంట్లో పెరిగిన వాతావరణం వేరు. విద్యార్థులతో తిరిగిన వాతావరణం వేరు.** విద్యాభ్యాసం కూడా ప్రత్యేకమైన పద్ధతిలో జరిగి వుంటుంది. ఇటువంటి వారికి బాల్యస్మృతులు అంతగా రుచించక పోవడంలో అర్థం లేకపోలేదు.

చిన్ననాటి విషయాలు అన్నీ అందరికీ జ్ఞాపకం ఉండవు. ఉండేవి కొన్ని మాత్రమే. అవి సుఖదుఃఖాల ప్రమేయంతో హృదయాన్ని కదిలించినవి గాని, దానికి సమానమైన అనుభూతిని రంగరించుకున్నవి గాని అయి వుంటాయి.




వయస్సు వస్తున్న కొద్దీ పరిచయాలు పెరుగుతుంటాయి. స్నేహితులూ ఎక్కువవుతుంటారు. బాల్య స్నేహానికున్న బలం ఇతర మా స్నేహాలకి వుండదని చాలమంది చెప్పుకున్నారు. అవన్నీ మధ్యలో వచ్చి మధ్యలో పోయేవే! ముందున్న చెవులకంటె వెనక వచ్చిన కొమ్ములు వాడిగా వుండవచ్చు. కాని, కొమ్ములు ఏ చిన్న ప్రమాదానికయినా విరిగి పోడానికి అవకాశం వుంది!

శ్రీ కృష్ణుడు కుచేలుని మైత్రి బాల్య స్నేహానికి ఆదర్శప్రాయమై వుంది.

చిన్నప్పుడు కలిసి చదువుకున్న వాళ్ళు ఎప్పుడో పది పన్నెండేళ్ళకు కలుసుకున్నప్పుడు వాళ్ళ మనస్సు, పరిస్థితి ఎలా వుంటుందో వేరే చెప్పనవసరం లేదు. ఎంతో ఆత్మీయతను అనుభవిస్తారు.

పోయిన పిన్నవయసు తిరిగి వచ్చేస్తుంది. కాస్సేపు అలా అలా బాల్యంలో విహరించి ఆనందిస్తారు. ప్రస్తుతం సంగతి వారు పట్టించుకోరు. చిన్ననాటి పరిచయాన్నే వారు ముచ్చటించుకుంటారు.

'సూరిగాడెలా వున్నాడు? సుబ్బిగాడెలా వున్నాడు?' అంటూ మిత్రుల యోగక్షేమాల్ని ప్రశ్నించుకోవడం; తర్వాత— 'కొత్తిమీర కట్ట ఎలా వుంది? హాంఫట్ ఎలా వున్నాడు?' అంటూ మాష్టర్లను తలచుకోవడమూ జరుగుతుంది. ఇది సహజం. పూర్తిగా ఆనాటి వాతావరణంలోకి వెళ్ళిపోయి గంటల తరబడి మాట్లాడేసుకుంటారు. అది వాళ్ళకు విసుగు అనిపించదు.

పైగా, ఉల్లాసంగా తనివి తీరా ఎంతో ఆప్యాయతతో మాట్లాడుకుంటారు.

మరి 'బాల్య శత్రువు' కనిపిస్తే వారి మనో ప్రవృత్తి ఎలా వుంటుంది? ఏనాటి **వాళ్ళు! [illegible] వాటేస్తారు!** **చిన్నప్పుడెప్పుడో తెలిసీ తెలియని వయ**స్సులో — గోళీలాడుకున్నప్పుడో, బొంగరాలాడుతున్నప్పుడో దెబ్బలాడినవాడు ఇప్పుడు కూడా శత్రువు కావాలనిలేదు. ఎంతయినా బాల్యస్నేహం బాల్యస్నేహమే!

ఇటీవల 'ఒక పద్మశ్రీ'గారి పుట్టినరోజు పండగ జరిగింది. పెద్దసభ ఏర్పాటయింది. అందులో మహామహులెంతోమంది ప్రసంగించారు. వారి ఉపన్యాస సారాంశంలో సగానికి పైగా పద్మశ్రీగారితో తమకు ఉన్న చిన్ననాటి పరిచయ విశేషాలే!

'నాటకాల్లో పద్మశ్రీగారి ప్రక్కన ఆడవేషం వేసేవాడిన'ని ఒకరన్నారు.

అలా ఒక్కొక్కరూ పరిచయం చేసుకుంటున్నప్పుడు వారిలో పురకలువేసే ఆనందం గోచరించింది. నిండు హృదయంలోనుంచి ప్రేమాభిమానాల్ని కురిపించారు. ఇది చిన్ననాటి మైత్రి విశేషం!

అయితే ఒక్క విషయం. పెద్దవాళ్ళ గురించిన పరిచయాలు, వాళ్ళ బాల్యవిశేషాలు వినేందుకు కుతూహలంగా వుంటాయి. అదే కుతూహలం, ఆసక్తి సమకాలికుల్లో కూడా వుంటుందా?

మీకు ఈ మధ్యనే ఒక వ్యక్తి పరిచయమయ్యాడు. అతను మీతో వస్తున్నాడనుకోండి. అంతలో మీ చిన్ననాటి స్నేహితుడొకరు హఠాత్తుగా ఏ పదేళ్ళకో ఎదురయ్యాడు. కనిపించగానే మీరతన్ని వాటేసుకొని వెనకటి సంగతుల్లోకి వెళ్ళిపోయారు. సమయం తెలియడం లేదు. వూపిరయినా పీల్చుకోకుండా బాల్యస్నేహాన్ని గుర్తు తెచ్చుకుంటున్నారు.

అప్పుడు, మీ కూడా వచ్చిన వ్యక్తికి ఎలా వుంటుంది? అరికాలి మంట నెత్తికెక్కి వుంటుంది. చిటపట లాడి పోతాడు. కాలుగాలిన పిల్లిలా కదిలిపోతాడు. ఎంతో అసౌకర్యాన్ని అనుభవిస్తాడు.

మీరు ఆనందిస్తున్న విధంగా అతనూ ఆనందిస్తున్నాడేమో అనుభవంతో మీరే తెలుసుకోవడం మంచిది!

అతని స్థానంలో మీరున్నా అదే పరిస్థితి, మీ స్థానంలో అతనున్నా అదే పరిస్థితి.

చిన్ననాటి దినాలు మరపురానివి. అవి స్వర్ణమయాలు! ●

# బొమ్మల నుడికట్టు

■ ఈ నుడికట్టులో కొన్ని మాటలకి మాత్రమే ఆధారాలు ఉంటాయి! తక్కిన వాటిని బొమ్మలని పట్టి నింపాలి!! కొన్ని గళ్లలో అక్షరాలు ఉన్నాయి కాబట్టి ఆ మాటలు కనిపెట్టటం మరింత తేలిక!!!




**అడ్డం**

4. U=గురువు, 1=?

7. 'చెప్పు' (అని అర్థం.)

8. కొండ

11. నాణె రూపంలో విలువ

**నిలువు**

2. పోట్లాట

3. 'రెండుకి రెండు కలిపితే నాలుగు' అవునా, కాదా?

9. పొడుగాటి కాయలని సాధారణంగా పులుసులో వేసుకుంటారు.

(జవాబులు 64 వ పేజీలో)

# భూగోళశాస్త్రం మీకెంత బాగా వచ్చు?

■ ఎదురు పేజి చిత్రపటంలో కొన్ని నదులకీ, ఊర్లకి అంకెలు వేసి ఉన్నాయి. అవి ఏవేవో ఎంత వరకూ సరిగ్గా చెప్పగలరో చూడండి!

నదులకి ఉపనదులూ, శాఖలూ ఉంటాయి కాబట్టి ముఖ్య భాగాల మీద సున్నాలు చుట్టి ఉన్నాయి. ఆ భాగాలలో వాటి పేర్లు ఏమిటో చెప్పాలి!!

జవాబులు ఇదే పేజీలో తల కిందులుగా వేసి ఉన్నాయి....

**నదులు !**

1. సబర్మతి, 2. నర్మద, 3. యమున, 4. గంగ, 5. బ్రహ్మపుత్ర, 6. మహానది. 7. గోదావరి 8. కృష్ణ, 9. తుంగభద్ర, 10. పెన్నేరు, 11. కావేరి.

**ఊర్లు !**

12. మధుర, 13. కోజికోడు, 14. మంగుళూరు, 15. పంజిమ్, 16. పూనా, 17. విశాఖపట్నం, 18. జంషెడ్‌పూరు. 19. బర్ద్వాన్, 20. షిల్లాంగ్, 21. అలహాబాద్, 22. భోపాల్, 23. బరోడా, 24. జోధపూర్, 25. చండీఘర్, 26. శ్రీనగర్.




**అందమైన ఊరది!**

ఆ ఊరంతటికీ అందమైన హోటలు పేరు ఊటీ! హోటల్ ఊటీ ఎంతందమైనదో అంత విలువైనది; అంత విలాసమైనదీను.

అందుచేత సాధార్నంగా హోటల్ ఊటీలోకి ఖరీదైనవాళ్లే వొస్తుంటారు. విలాసాలకి విలువెంత వున్నదో వొచ్చినవాళ్లక్కడ తెలుసుకుంటారు. ఈ కారణంగా సామాన్య మానవులకక్కడ చోటు వుండదు. కాదు కూడదంటే వాళ్లందరికది ఏక్ దిన్ కా... బావతే అవుతుంది.

హోటల్ ఊటీకి రాంప్రసాద్ వొచ్చిన వేళ సరిగ్గా రాత్రి తొమ్మిదిన్నర. అతని పక్కనే ఒక దేవత గూడా వున్నదప్పుడు. ఆ దేవత నిలువెల్లా ధగధగా మెరిసిపోతూన్న పుత్తడి బొమ్మలాగుంది. వాళ్లిద్దరూ కలిసి నవ్వినప్పుడు దేవత నవ్వొక్కటే స్పష్టంగా వినిపించి, అది అమృతధారగామారి అతని పెర్సనాలిటీ మొత్తాన్ని మరిపించేస్తోంది. అప్పుడతను కించిత్తు గూడా బాధపడినట్టులేదు. మీదుమిక్కిలి అతను గుండెల్నిండా యింత ఆనందాన్ని నింపుకుని పేలేగి పోతూన్నట్టు వుంది.

వాళ్లిద్దరూ సెవెంటీఫోర్‌లోకి వెళ్లేరు.

ఆ గది విశాలమైనదీ, అధునాతనమైనదీను. ఆ గది తలుపు తెరిచిన మనిషి రాంప్రసాద్‌కి వినయంగా దారి చూపించి పక్కకి తొలిగి నించున్నాడు.

'దటీజ్ రైట్.' అన్నాడు రాంప్రసాద్.

గదిలో అతను కూర్చున్నాడు. ఆమె కూర్చోలేదు,

'నేనెంతవరకు చెప్పేను?' అడిగేడతను.

'బొంబే టూర్ పూర్తి చేసేరు,'

'అవునా... అప్పుడేమయింది. ఎవడో ఫూల్ నా టూర్ విషయమై బాస్‌కి ఆకాశ రామన్న ఉత్తరం రాసేట్ట. నా దినచర్యంతా ఆ ఉత్తరంలో యిరికించేడు. రోజుకి నేనెన్ని పాపాలు చేస్తుంటానో, ఎంతమంది నెత్తురు తాగుతానో, ఎంత అవినీతిని తింటానో— ఇవన్నీ రాసిపారేసేడు. కుసుమని ఒక దరిద్రం మా ఆఫీసులో చేరి నాకు గొప్ప టార్చరిస్తే—అది నేను సహించలేక ఆ పిల్లని ఉద్యోగంలోంచి తొలిగించేను. ఇప్పుడెక్కడేడుస్తుందో నాకైతే తెలీదుగాని— దాని విషయమ్మూ ఆ ఉత్తరంలో రాసేట్ట

ఫూల్.'

'ఎంత ప్రమాదం?'

'ఐతే! ప్రమాదమా? ఇంకా నయం. బాస్ బసవరాజు గురించి నాకు పూర్తిగా తెలుసు. మంచి యజమాని. తెలుగువాళ్ళకి ఇంగ్లీషు మనిషి అతను. ఈ లోగట్టా సర్వం చదివి ట్రంక్ బుక్ చేసి నన్ను వివరాలడిగేడు. ఐ సెడ్ నథింగ్. ఆ తర్వాత ఎంక్వయిరీ నిమిత్తం సాక్షాత్తు బసవరాజే మా బ్రాంచి కొచ్చేడు. ఆఫీసంతా చెక్ చేసేడు. నేనేమైన తక్కువ తిన్న వెధవనా మిస్ లిల్లీ? ఈనాడు లక్షల్లో ఈ బ్రాంచి వ్యాపారం చేస్తుందంటే, ఇదంతా నా నిర్వాహకం. అంచేతనే మనిషి మరి నోరెత్తకుండా వొచ్చిందారినే వెళ్ళిపోయేడు.'

ఆ చల్లటి మాట వినడంతోటే మిస్ లిల్లీ కూర్చోగలిగింది. కూర్చుని తన అందమైన రెండు చేతుల్నీ గుండెలమీద వుంచుకుని, ఇంతగాలి పీల్చుకుని అన్నది—

'ఊష్...గండం గడిచింది బాబు! అదిరి చచ్చిపోయేను.'

అతనెంతో లేలిగ్గా, గొప్పగా ఎక్కువ సేపు నవ్వేసి ఇంకాస్త సర్దుక్కూర్చుని రీజెంట్ సిగరెట్టు ముట్టించి కాళ్ళురెండు వూపుతూ, సిగరెట్టు పొగని పైకి వొదుల్తూ అన్నాడు.

'చిన్నప్పట్నుంచీ నాకు సాహసాలంటే మహాయిష్టం. ఒక్క మాటలో చెప్పాలంటే నేనుత్త సాహసాల మనిషిని. నా పదో ఏటనే నే నాక పాముని చంపేను. నాన్నగారి తుపాకి తీసుకుని ఆరోజుల్లోనే షికార్ చేసే వాడిని.'

'మనుషుల్నే!' ఆశ్చర్యపోతూ అడిగింది లిల్లీ.

'కాదు కాదు పిట్టల్ని. గురి తప్పేదికాదు. దెబ్బకిలా! కింద పడి గిలగిలా తన్నుకు చచ్చేవి. నాకప్పుడు వొళ్ళు జలదరించేది.'

అతనికి ఉత్సాహం ఎక్కువై పోతున్నప్పుడు, అతని కళ్ళు గూడా అరమోడ్పు లవుతూన్నట్టు గమనించింది మిస్ లిల్లీ. అతను కొంచెం ఊగుతున్నట్టు గూడా పసిగట్టింది. ఇక్కడి కొచ్చేముందు సోమయాజులింట్లో జరిగిన విందులో అతను పుచ్చుకున్న 'వేట్ సిక్సిటీనైన్' వైనం వెంటనే స్ఫురించింది. మిస్ లిల్లీ మరేం మాటాడకుండా అతను చెప్పబోయే ఉల్లాసాన్నీ; అల్లర్నీ శ్రద్ధగా వినాలని తొందర పడింది. ఆ కారణంగా ఆమె కొంచెం ముందుకు జరిగింది.

'సిక్స్టీవన్లో కాబోలు! బసవరాజుతో పరిచయం నాకు. అతను నన్ను రెండేళ్ళు పరీక్షచేసిగానీ, ఈ ఉద్యోగం యివ్వలేదు. క్రమశిక్షణంటే అతనికి ఆరో ప్రాణం. దాన్ని నేనిక్కడ నిర్లక్ష్యం చేసి తిరుగుతున్నానని ఆ ఉత్తరం చెబితే — నిజానికి మరోడు మరోడైతే ఉరేసుకున్నంత పని. బట్! రాంప్రసాద్ బెదిరి అదిరిపోయే మనిషికాదు. నేను నటుడినన్న సంగతి నీకు తెలిసే వుంటుంది.'

'అవునవును. అది నేనెలా మరిచిపోతాను? యూనివర్సిటీ...'

'స్టాపిట్. గుర్తుచేయకు మిస్ లిల్లీ. నాకేడుపొస్తుందంతె. ఇప్పుడు చెప్పు ఆనాటి రాంప్రసాద్లోని ఉత్సాహం ఈనాటికొచ్చి రవంతైనా తగ్గిందా?'

'లేదు.'

'థేంక్స్...నిజమే. బాస్ బసవరాజుకి నేను లక్షలు సంపాయించిపెడుతున్నాను. అతన్నాకు జీతంగా కొంత పే జేస్తున్నాడు. ఆ కొంత నాకు చాలదు. ఆ కొంతలోనే నన్ను బతికేయమని అతను ఆర్డరేస్తే నేనందుకు ఛస్తే వొప్పుకోను. నాకింకా ఎక్కువ కావాలి. బిజినెస్లో మనిషి మరో మనిషిని ఉద్ధరించాలనే ధర్మసూత్రం ఎక్కడాలేదు. అందుచేత, ఈచేత్తో అతనికి లక్షలు సంపాయించి, మరోచేత్తో నేను వేలు తీసుకుంటున్నాను. వేలు తీసుకునే చేతిని అతను నరికిపారేస్తే అతనికొచ్చిపడే లక్షలమాటేమిటి? బంద్. రాంప్రసాద్ బిజినెస్ చేయలేడు. కనక ఏమిటి చేస్తున్నాను—ఇటు నేనూ, అటు అతనూ బాగుపడే మార్గాన్ని నేను అనుసరిస్తున్నాను. దీన్లో అవినీతి, క్రమశిక్షణా అనీ పెద్ద పెద్ద మాటలకి స్థానం లేదంతె. ఏ మై కరెక్ట్?'

'కరెక్ట్.'

'అందుచేత—నువ్వు రేపొద్దున హైద్రాబాద్ వెడతావు. నీకు బసవరాజు బాగా తెలుసు. అతన్తో, అవకాశం చిక్కినప్పుడు నాగురించి 'మంచే' చెప్పు. అతనడక్కపోయినా సరే—నువ్వే చెప్పు. జస్ట్ ట్రై.'

మిస్ లిల్లీ రాంప్రసాద్ని విడిపించాలనే ఉద్దేశంతో మరి కొంచెం దగ్గిరిగా జరిగి, అతని కళ్ళలోకి నవ్వుతూ అన్నది—

'నీకు సాహసాలంటే యిష్టం! నీ పదో ఏట పాముని చంపేవు. పిట్టల్ని కాల్చేవు. అలాటిది, మై డియర్ ప్రసాద్—బసవరాజుతో నేను నీగురించి మంచే చెప్పాలని ప్రాధేయపడతావెందుకు?'

'వండర్ ఫుల్! నేను తాగి వున్నానరే, మనిషిని యిట్టే చదివేయగలను తెలుసా? నువ్వొకటి మరిచిపోతున్నావు లిల్లీ! నాకీలాటి ఉద్యోగమిమ్మాద మోజెక్కువని నీకూ తెలుసుగదా. ఇంతపెద్ద ఉద్యోగం ఎవడో ఒక అనామకుడి దుష్ప్రచారంతో మట్టికొట్టుకుపోవడం నాకిష్టంలేదు. గనక నేనీ ఉద్యోగం నిలుపుకోవడమనేది గూడా ఒక గొప్ప గేమ్! సాహసం! అందుచేత నేనీ విషయంలో జాగ్రత్తగానే వుండాలి. అది రూలు.'

అప్పుడు మిస్ లిల్లీ పకపకా నవ్వేసింది!

'నిజం చెప్పనా మిస్ లిల్లీ! ఒక అందమైన ఆడపిల్ల, నాకు అతి దగ్గిరిగా కూర్చుని అందంగా నవ్వేస్తుంటే నన్ను నేనే మరిచిపోతాను. నాకు ఆవేశం ఎక్కువ. నేనుత్త తొందరమనిషిని. వింటున్నావా?'

'ఏమో, అలా అని నువ్వు చెప్పడమైతే వింటున్నాను గానీ, నిజమని నమ్మలేదింకా.' అన్నది మరింత అందంగా నవ్వేస్తూ.

రాంప్రసాద్కి కోపం వొచ్చింది. సిగరెట్టు పారేసేడు. మనిషి యావత్తూ నిద్రొచ్చిన వాడిలా జోగేతూ తలుపు దగ్గిరికి వెళ్ళేడు. తలుపు వేస్తుండగా అతనో మనిషిని చూచి అక్కడే ఆగిపోయేడు. రాంప్రసాద్ని చూచి ఆ మనిషి వేగంగా వొచ్చేడు.

'నాలుగ్గంటల్నుంచీ మీ కోసం తిరుగుతున్నాను.' అన్నాడతను వినయం నటించి.

'ఏమిటి విశేషం?'

'ఇవాళొక విశేషమే జరిగింది సార్! మా ఫ్రెండ్ని రైల్లో ఎక్కించేందుకు స్టేషన్కి వెళ్ళేను. అతన్నెక్కించిన తర్వాత రైలు కదిలింది. ఆ రైల్లో బసవరాజుగారు కనిపించేరు సార్!'

'వాట్?'

'నిజం సార్!'

'ఎక్కడ నుంచి ఎక్కడికి వెడుతున్నాడో?'

'తెలీదుసార్.'

'నిజమే చెబుతున్నావా జగన్నాథం?'

'సచ్చి నిజం సార్! ఈ కళ్ళతో నేను

చూసేను. సాక్షాత్తు బసవరాజుగారే!'

'అయితే నువ్వు పద. నేనొస్తున్నాను.'

జగన్నాథం వెళ్ళిపోయింతర్వాత రాంప్రసాద్ లోపలికొచ్చేడు.

'ఏమిటిట? వొచ్చిందెవరు?'

'జగన్నాథమని మా ఆఫీసతను. అదిసరే గానీ, నువ్వూ జనతాలోనే వొచ్చేవుగదూ?'

'అవును. అయితే ఏమిటిట?'

'ఆ రైల్లో బసవరాజు రాలేదూ? నువ్వతన్ని చూళ్ళేదూ?'

లిల్లీ మళ్ళీ నవ్వబోయి ఆగి అన్నది—

'పాముల్నీ, పిట్లర్నీ, సాహసాల్నీ లెక్కచేయని రాంప్రసాద్ బసవరాజనబడే ఒక మనిషికి భయపడి ఛస్తున్నాడంటే నాకు నవ్వొస్తుంది. నువ్వేడ్చి పోనంటే జాలి గూడా కలుగుతోంది. పిటీ. పిటీ!'

'నాన్‌సెన్స్. నీకు వేళాకోళంగా వున్నట్టుంది'

'కాదామరి? అంత పొడుగ్గా వున్న రైల్లో, అంతమంది ప్రయాణీకుల్లో బసవరాజుని చూసేవా అని అడగడమేమిటి? నేనొచ్చిందేమైనా స్టేట్ బస్సులోనా — నలభైమందిలో అతన్ని పసిగట్టేందుకు? బలేవాడివి ప్రసాద్.'

'గుడ్‌నైట్ నేనొస్తాను.'

'అప్పుడే?'

'నాకు పనుంది. వెళ్ళాలి.'

'ఆవేశం ఎక్కువన్నావు. తొందరమనిషి నన్నావు. అందమైన ఆడపిల్లా, అందమైన...'

'ప్లీజ్. మరోసారి నిన్ను తప్పకుండా కలుసుకుంటానుగా. వొస్తా. లెట్‌మి గో...' అన్నాడతను ప్రాధేయపూర్వకంగా.

అప్పుడు లిల్లీ గట్టిగా అరిచేసింది.

'గో...ఇప్పుడు నేను నీ మెడకి కళ్ళెం వేయలేదే! రాకరాక వొచ్చేను; ఎన్నో నెలల్గాని నిన్ను చూడ్డం పడలేదని నేనిద్దైపోతుంటే, వెళ్ళిపోతానని నువ్వు మారాం చేస్తే నేను కాదన్నా నువ్వాగుతావా? గో డియర్ గో!'

రాంప్రసాద్ చేతికున్న వాచీని, గది తలుపునీ రెంటినీ చూసేడు. మిస్ లిల్లీ కళ్ళల్లో టెక్నికలర్ భావాన్నీ చూసేడు. అందుచేత అతను తలుపువేసి లిల్లీని చేరుకున్నాడు.

* * *

బసవరాజు అండ్ బ్రదర్స్ తాలూకు ఈ బ్రాంచి ఆఫీసు ఒక పెద్ద పాతగూడు. ఈ పాతగూడు అందంగా వుంటుంది. ఈ పాతగూడులో కొందరుద్యోగస్థులున్నారు. వాళ్ళంతా దౌర్భాగ్యులని చెప్పడం మంచిది కాదు. కొంద రదృష్టవంతులక్కడ వున్నారు.

లౌక్యం తెలిసిన మనిషి సర్వసాధారణంగా జీవితంలో ఓడిపోడమంటూ జరగదు అలాటి మనిషికి జీవితం చాలా అందుబాటులో వున్నట్టు, చెప్పినట్టు నడిచే యంత్రం మాదిరి సాగిపోతుంటుంది.

ఆ మనిషిక్కొన్ని సూత్రాలుంటాయి. ఏ ఎండకా గొడుగు అన్నట్టు అతని చేతిలో కొన్ని గొడుగులూ వుంటాయి. దేవుడయ్యేదీ, వాడి తల తన్నేవాడయ్యేదీ — అతని గొడుగు నీడని చేరి బ్రతకవలసిందే.

ఇలాటి లౌక్యం నరనరాన్న ప్రవహిస్తున్న మనిషి పేరు జగన్నాథం. మనిషి మొత్తం 'పీనుగ'లా వున్నా, అమోఘమైన తెలివి కతను కేంద్రస్థానం. మహామహా గొప్పవాళ్ళతో అతను కుస్తీలు పట్టేసి వాళ్ళని సునాయసంగా చిత్తుచేసేయగల దిట్ట. అంతటివాడికి ఈ రాంప్రసాద్‌ని బొమ్మగా చేయడం ఏమంత దుస్సాధ్యమైన కార్యంకాదు.

రాంప్రసాద్ ఈ బ్రాంచికి మేనేజరైన శుభముహూర్తాన ఈ పీనుగ అక్కడే వున్నాడు. అప్పట్లో అతను మరింత అసహ్యంగా వుండేవాడు. ఎటొచ్చీ—అప్పుడూ యిప్పుడూ మారనిది అతని వక్రబుద్ధి!

జగన్నాథానికి నీతిపట్లా, ధర్మం పట్లా అమోఘమైన ఆసక్తిలేదు. మనిషన్నవాడు గొప్పగా బతకాలనుకున్నప్పుడు—ఈ రెండు బరువు మాటల్ని తోసవతల పారేయాలనేది అతని సిద్ధాంతం.

ఎదటి మనిషిని చూసిచూడటంతోటే, అతని ఆలోచనలన్నింటినీ గ్రహించి, ఎక్కడే దెబ్బతియ్యాలో గమనించి మరీ సంచరించే ఒక్కటి జంతువతను; చెడ్డ ఆకలితో, బోనులో దిక్కుతోచక దిక్కులన్నీ మార్మోగేలా గాండ్రించే ఆకలి పులి అతను! అతని కళ్ళు, అతని చూపూ ఎల్లప్పుడూ మండిపోతూనే వుంటాయి.

అంతటి జగన్నాథం సాధారణంగా నవ్వలేడు. ఎదటివాడి వినోదం కోసం అతనెప్పుడైనా నవ్వ ప్రయత్నిస్తే, అది కటువుగానూ, దుర్మార్గంగానూ కనిపించినా, ఆ నవ్వు ఎదటి మనిషిని చిత్తు చేసేయగలదు.

రాంప్రసాద్ పట్ల జగన్నాథాని కున్న అభిప్రాయాలు రెండు:

'శ్రీవారు దర్జాగల పురుషులు. వారెంతో వినయ సంపన్నులు. రేయింబవళ్ళు నిస్వార్థ చింతనతో కష్టించి అంత బ్రాంచీని ఇంత చేసేరు. కుర్రవాళ్ళయినా, వ్యాపారానుభవంలో తల నెరిసిపోయిన మహానుభావులు. అందుచేతనే బసవరాజుబాబుగారు ప్రసాద్ బాబుగారిని నెత్తిమీదెట్టుకున్నారోయ్ నన్నాసులూ! మీకు తెలీదేమిటి—శ్రీవారు అజేయులు.'

ఇక రెండో పక్క:

'కుర్రముండా కొడుకు! జోరుచేస్తున్నాడు. పట్టపగ్గాల్లేవు వీడి అవినీతికి. కిందా మీదా పడి వేలకివేలు అన్యాయంగా ఆర్జించేస్తున్నాడు. కళ్ళులేని బాస్‌కి వీడొక దేవుడైపోయేడు. వెధవ — ఎలకలాటి మనిషికి ఏనుగంత జాతకమా! ఒరే ప్రసాదూ, నీ రోజులు దగ్గిర పడ్డాయిరా బాబూ! ఆనాడు నిన్ను దేవుడు గూడా రక్షించలేడు.'

కనక, జగన్నాథం అసాధ్యుడు. ఆ బ్రాంచీలోనేకాదు — ఈ ప్రపంచంలో ఎక్కడే మూల విసిరికొట్టినా అక్కడ గూడా నిక్షేపంగా బతికేయగలడతను.

ఆ బ్రాంచీలోనే ఒక గంగిగోవూ గలదు. దానిపేరు ముకుందరావు బి. ఎ. భూమ్మీదున్న శోకాన్ని యావత్తూ తన నెత్తిమీదే పెట్టుకున్నట్టు వున్నా అతనెంతో అందమైనవాడు. అంతందమైన మనిషి మీద దేవుడు పగబట్టి యిలా చిత్రహింస పెట్టేస్తున్నాడా పాపం అనే భ్రమ అతన్ని చూచేవాడిక్కలుగుతుంది.

ఆనాడక్కడ ఆకలి పులి గంగిగోవు మీద విరుచుకు పడింది—

'మరేం చెప్పకు ముకుందం! నాకు వొళ్ళు మండిపోతోంది. నాకన్నీ తెలుసు. ఏమిటనుకుంటున్నావో ఏమిటో. నువ్వు నోరు తెరుస్తే—ఆ ... అంతే టకటకా నీ జాతకం చెప్పేయగలను. శెలవిచ్చేంత వరకూ నా ప్రాణం తీసేసేవ్. ఇచ్చిం తర్వాత నీ యిష్టమొచ్చినట్టు పాడిగింపులు. ఏమిటో అనుకున్నాను. మెత్తటి మనిషి (మొత్తినా ఫర్లేదు), ఏదో బుద్ధిమంతుడావటాని యిన్నాళ్ళూ అనుకున్నాను. ఇక చాలు. వెళ్ళు...వెళ్ళు...'

ముకుందరావు రెండు నిమిషాలు పీళ్ళ

# తలనొప్పా?

# సారిడన్ 'రోష్' వేసుకోండి

## నొప్పి మటుమాయమై...



## ...మీకు నవోత్సాహము కలుగుతుంది!

**అదే సారిడన్ యొక్క ప్రత్యేకత!** నొప్పిని, దాని వలన కలిగే శ్రమను పోగొట్టుటయేగాక, హాయి నవోత్సాహములనుకూడ కలిగించుటకై సారిడన్ ఒక ప్రత్యేక సూత్రముతో తయారు చేయబడినది. దానిని వేసుకోగానే మీలో ఎంత మార్పు వస్తుంది! నొప్పి, శ్రమ మటుమాయమై సరిగ్గా ఆలోచించ కలుగుతారు ... పని యందు ఆసక్తి కలుగుతుంది ... స్నేహితులతో సరదాగా వుండగలుగుతారు ... ఒకే ఒక సారిడన్ నొప్పిని పోగొట్టును, సేద దేర్చును, నవోత్సాహమును కలిగించును. ఎల్లప్పుడూ సారిడన్‌ను మీ దగ్గర వుంచుకోండి. పిల్లలకు ½ నుంచి ¾ బిళ్ల వరకు మాత్రమే చాలును.

VT. 5626 (A)




తలనొప్పి
పంటినొప్పి
ఒంటినొప్పి
బహిష్టునొప్పి

ఒకే ఒక సారిడన్‌తో మటుమాయమవుతాయి!

'రోష్' తయారు
ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్లాస్ లిమిటెడ్

సమిరి మెల్లిగా అనగరిగేడు—'

'పాకి! నేను సెలవు పెట్టడం వల్ల మీరింత—'

'ఎంతేమిటయ్యా? ఇంతంటున్నావు. సెలవు సెలవు, నీ సర్వీసంతా సెలవ ల్తోనే తగలడేట్టుంది.'

'వాళ్ళో కుటుంబం వుంది—'

'ఎవరికిలేదు? అకాడికి మేమంతా సన్నాసులమా, శంభో హరహరా అన్చెప్పి దేశాలు తిరిగేందుకు, ఇదుగో ముకుంద రావు, ఆ కేస్ట్ మాటాడకుండా వెళ్ళిపో, నీ పనేదో చూచుకో, అయ్యగారొచ్చే వేళవు తోంది— వెళ్ళి కూచో బాబు వెళ్ళు.'

ముకుందరావు అతి నెమ్మదిగా వెళ్ళి తన సీట్లో కూర్చున్నాడు. చేతి రుమాలుతో మొహం తుడుచుకుని చూపు బల్ల మీదుంచేడు.

గంగిగోవు పక్కడ పులి తింటూన్న వేళకి, సరిగ్గా అప్పుడే వొచ్చింది. ఒక కిరణం, ఒక వెలుగు, ఒకగాలి, సుగంధం, కొత్త తేజస్సు. ఆఫీసు ఆఫీసంతా తలలెత్తి దిగ్భ్రాంతితో చూపులన్నీ ఆ ఆకారం మీద కేంద్రీకరింప జేసేరు.

ఆఫీసు ప్యూన్ నాగన్న లేచి గుమ్మం దగ్గిరికి వెళ్ళేడు—

'ఎవరు కావాలమ్మా!'

'మేనేజరు గారు—'

వీణ తంత్రులు రమణీయమైన సంగీతం వేసినట్టుందా మాట.

జగన్నాథం లేచి నించుని పిదటంగా అన్నాడు.

'లోపలికి రండి.'

ఒక అప్సరస భూమ్మీదికి దిగి, మునుపే ఎంచుకున్న స్థలంలో నడిచినట్టు అతి జాగ్రత్తగా నడిచి వొచ్చిందామె, వొచ్చి జగన్నాథం ముందు నించుంది.

'కూర్చోండి!' అన్నాడు జగన్నాథం.

కూర్చున్నది.

'చెప్పండి, మీకేం కావాలి?'

'మీరేనా మేనేజరు?'

జగన్నాథం తలొంచుకుని నవ్వేసి తలెత్తి అడిగేడు.

'ముందు పేరేమిటో చెప్పండి.'

'మిస్ ఇందిర!'

'చూడండమ్మా ఇందిరగారూ! నాపేరు జగన్నాథం, అయ్యగారింకా రాలేదు.

# పరివృత్తం

వారొచ్చే వేళయింది. వారికి నేను పి. ఏ. ని! మీకేం అభ్యంతరం లేకపోతే మీరొచ్చిన పనేమిటో చెప్పండి. అయ్యగారికి కొంచె మైనా శ్రమ తప్పించిన వాడి నవుతాను.'

ఇందిర ఆఫీసునంతా కలయజూసింది. అందరూ మగవాళ్ళే కనిపించేరు. ఓ చోట టైపు మిషను శబ్దం వినిపించగా — అటువేపు చూసింది. ఓ పాత టైపు మిషను ముందు ఒక బంతిపూవు కనిపించ డంతో ఆశ్చర్యపోయింది. ఇంతమంది మగ వాళ్ళమధ్య ఒక ఆడపిల్ల గూడా ఉద్యోగం చేస్తున్నదని తెలీగానే చెప్పలేనంత ఆనందమూ కలిగింది.

'మీ రొచ్చిన పనేమిటో ...' జగ న్నాథం అరిగిపోయిన గ్రామఫోన్ రికార్డు లాగా యింకా గుణుస్తూనే వున్నాడు.

అప్పుడు చెప్పింది ఇందిర—

'మొన్ననే హెడ్ ఆఫీసులో ఇంటర్వ్యూ జరిగింది. నేనా ఇంటర్వ్యూలో సెలెక్టు య్యేను. ఇక్కడున్న ఓ ఖాళీలో నన్ను పోస్టు చేసేరు.'

అది విన్న తర్వాత జగన్నాథం గాలి పీల్చుకున్నాడు. చేతులు రెండూ బల్ల కానించి అన్నాడు.

'అయితే ఉద్యోగాని కొచ్చేరన్నమాట. బాగుంది. మంచిది. అట్లాగే. భేష్...'

జగన్నాథం దండక మెందుకు చదువు తున్నాడో ఇందిరకి అర్థం కాలేదు. అందు చేత విత్తరపోయి, బంతిపూవువేపు చూసింది.

సరిగ్గా అప్పుడే బంతిపూవూ ఇందిర వేపు చూసి అనుకున్నది—

'పాలగూడిది! వెళ్ళిపో ఇందిరా. వెళ్ళిపో!'

జగన్నాథం, తన తలపైన తిరుగుతూన్న పంకావేపు చూస్తూ జనాంతికంగా అనేసేడు.

'అవును గదూ! కుసుమ రాజీనామా యిచ్చిన సంగతి నేనెప్పుడో మరిచిపోయేను. అవునవును. ఇక్కడొక ఖాళీ వుందిగా. అలా చెప్పు. అవుతే బసవరాజాగారు ఈ ఖాళీని పూర్తిచేసేరన్నమాట. బాగుంది.'

ఒక బల్ల దగ్గిర ఇద్దరున్నారు. బెదు రుతూ ఇందిరవేపు చూసి అనుకున్నాడు.

'మళ్ళీ అమ్మాయే? బాస్‌కి మంచి టేస్టుంది గురూ!'

'ఇంత చక్కటి అమ్మాయి ఉద్యోగం చేయడం నాకిష్టంలేదు.'

ముకుందరావు ఇందిరని చూసి, తల దించుకున్నాడు.

జగన్నాథమే అన్నాడు.

'చూడిందిరా! మరి నీ వెంట ఆఫీ సార్డరూ వగైరా తెచ్చుకున్నావా?'

ఇందిర తలూపింది.

'అవుతే—నువ్వెళ్ళి ఆ టైపిస్టు పక్కన కూర్చో. అయ్యగారొచ్చేవేళయింది. ఆయ నొచ్చిం తర్వాత జాయినింగ్ రిపోర్టిద్దువు గాని. వెళ్ళి అక్కడ కూచో.' అన్నాడు జగన్నాథం.

ఇందిర టైపిస్టు దగ్గిరకి వెళ్ళి నించుంది. అక్కడ నాగన్న వేసిన కుర్చీలో కూర్చుంది. కూర్చుంటూ బంతిపూవుతో అన్నది.

'నా పేరు ఇందిర.'

'విన్నాను. మంచిపేరు!'

'మీ పేరు?'

'పద్మ. అవును గానీ; ఎంతవరకు చదివేవు?'

'బి. ఎ. పాసయ్యేను.'

'ఉద్యోగం చేయాలని సరదానా? లేక అవసరమా?' అన్నది పద్మ ఇందిరవేపు సూటిగా చూస్తూ.

ఇందిర క్షణ మాగి చెప్పింది—

'రెండూను.'

అప్పుడు పద్మ చాలా విచిత్రంగా అన్నది.

'ఇక్కడ నువ్వు ఉద్యోగం చేయలేవు ఇందిరా! వెళ్ళిపో.'

'అది మీకెలా తెలుసు?'

'నిన్ను చూడగానే అలా అనిపిస్తోంది.'

'మరి మీరెలా చేస్తున్నారు?'

ఆ ప్రశ్నకి పద్మ జవాబు చెప్పలేదు. టైపు చేసుకోడం ప్రారంభించింది. మధ్యలో మళ్ళా అడిగింది ఇందిర.

'చెప్పరేం? మీరిక్కడ ఉద్యోగ మెలా చేస్తున్నారు?'

'గతిలేక ఇందిరా! గతిలేక.'

'నేనూ అందుకేనని మీరెందుకు అనుకో కూడదు?'

'నీకో కథ చెప్పేదా?'

'ఇప్పుడే చెబుతారా?'

'సంక్షేపంగా. చిన్న కథే. అయితేనేం మహా భయంకరమైన కథ. ఇదే ఆఫీసులో నీ అంత అందమైన అమ్మాయే కుసుమని

# సుందరమైన ట్రౌజర్లకు మామూలు సూట్లకు

టాటా టెక్స్టైల్సు వారి గాబర్డీన్లు మరియు
టెర్వోర్ల కన్నా శ్రేష్ఠమైనవి ఇంకేవి ?
ప్రతివారి ఆర్థిక స్తోమతకు అనుకూలించే
వివిధ రకముల బట్టలు

ఈ వివిధరకములను అడగండి, టెర్వోర్లో
"క్రిస్పా" "ప్లేబోయ్" "ఇల్-వీవ్" మరియు
గాబర్డీన్లో "గిరిరాజ్".

**TATA** *Textiles*



చిల్లరగా అమ్మేదుకాణాలు:
30, మూర్ స్ట్రీట్, పుదుచ్చేరి
చిల్లర స్టాకిస్టులు:
స్టాన్ కార్పొరేషన్, వేలాజీ ముఖాన్ రోడ్,
మదరాసు.

TATA Textiles TATA Textiles TATA Textiles TATA Textiles

ULKA-TT-72 Tb

ఒక ఆడపిల్లని ఆర్నెల్లు ఉద్యోగంచేసి మానేసింది.'

'ఎందుకనిట ?'

'ఇక్కడ వాతావరణం సరిపడక.'

'మీకు సరిపడిందా ?'

పద్మ పేలవంగా నవ్వేసి అన్నది.

'నేను రాతిబొమ్మ నిందిరా! పాశం. నిక్షేపంగా వున్నాను. ఇక్కడ మల్లెపూవులకి మాత్రం చోటు లేదు.'

పద్మ చేతికున్న అందమైన వేళ్ళు టకటగా టైపు చేస్తూంటే చూచేందుకు తమాషాగా వున్నది ఇందిరకి. కాసేపాగింతర్వాత పద్మ తలెత్తి ఇందిరవేపు చూచింది ఇందిరేదో ఆలోచిస్తున్నట్టు కనుపించడంతో అడిగింది.

'భయంగా వున్నదా చెల్లీ?'

ఇందిర ఉలిక్కిపడింది.

'వాదంతా పిచ్చిగోల. నీకేంతోస్తే అది చెయ్యి.' అన్నది పద్మ.

'కుసుమకి వాతావరణం ఎందుకు సరిపడలేదు?'

'చెప్పక తప్పదా?'

చెప్పండి!'

ఎంతో రహస్యంగా చెప్పింది పద్మ

'కుసుమని మోసం చేసేడు మేనేజరు. ఆ అమ్మాయి బతుకు అల్లరిపాలు చేసేడు. ఎన్నో ఆశలు చూపించి దగాచేసేడు. అందుకు — అందుకే కుసుమ యిక్కడ్నుంచి పారిపోయింది. గుండె నిబ్బరం గల మనిషి కనుక చావలేదు.'

—పన్నెండున్నరకి మేనేజరు కారు హారను వినిపించడంతో ఆఫీసులో కలవరం విజృంభించింది. జగన్నాథం సీటు నుంచి లేచి గబగబా గుమ్మం దగ్గిరికి వెళ్ళి నించున్నాడు.

# పరివృతం

ఖరీదైన సూటులో రాంప్రసాద్ మంచి దర్జాగా వున్నాడు. అతను విలాసంగా సిగరెట్టు కాల్చుకుంటూ, జగన్నాథం అందించిన నమస్కారాన్ని పుచ్చుకుని తన గదిలోకి వెళ్ళిపోయేడు. వెనకనే జగన్నాథమూ వెళ్ళేడు.

ఆఫీసంతా నిశ్శబ్దంగా వున్నది.

పది నిమిషాల తర్వాత నాగన్న వొచ్చి ఇందిర దగ్గిరున్న ఆఫీసార్డరు పుచ్చుకుని రాంప్రసాద్ గదిలోకి వెళ్ళేడు. మరో అయిదు నిమిషాలకి ఇందిరకి పిలుపొచ్చింది. ఇందిర లేచి నించున్నప్పుడు పద్మ విసురుగా టైపు చేయడం మొదలు పెట్టింది.

రాంప్రసాద్ ఎదట నిలబడి నమస్కారం చేసింది ఇందిర. అతను ఇందిరవేపు చూడకుండానే.

'కూర్చోండి.' అన్నాడు.

ఇందిర పొందిగ్గా కూర్చుంది.

'యూ ఆర్ బి. ఎ?' అన్నాడతను.

తలూపింది ఇందిర.

'వెరీగుడ్. మిస్టర్ జగన్నాథం, ఇందిర దగ్గిర జాయినింగ్ రిపోర్టు తీసుకో. ముందు ఫార్మాలిటీస్ పూర్తిచేయండి. గో.' అన్నాడు.

జగన్నాథం ఇందిర దగ్గిర జాయినింగ్ రిపోర్టు తీసుకుంటూండగా, అతను మిస్ లిల్లీ ఆఫీసు ప్రవేశాన్ని తిలకించేడు. అందుచేత వినయంగా లేచి నిలబడి అన్నాడు.

'రండి. రండి. అయ్యగారిప్పుడే వొచ్చేరు— లోపలున్నారు.'

జగన్నాథం మాటలు మిస్ లిల్లీ వినిపించుకోలేదు. గబ గబా రాంప్రసాద్ గదిలోకి అడుగుపెట్టి, తలుపు మూసి అక్కడే వయ్యారంగా నించుంది.

మిస్ లిల్లీని చూచిన రాం ప్రసాద్ ఆశ్చర్య పోయేడు.

'గుడ్‌గాడ్! నువ్వింకా వెళ్ళలేదన్నమాట?,

'ఎలా వెడతాను?'

'అదేమిటి?'

లిల్లీ ఒక కుర్చీని అతని దగ్గిరిగా లాక్కుని కూర్చుంది. కూడా తెచ్చుకున్న వేనిటీ బాగ్‌లోంచి ఒక పర్సుని తీసి బల్లమీదుంచి అన్నది—

'ఎంత డబ్బు సంపాయిస్తే మాత్రం, డబ్బుమీద నిర్లక్ష్యం ఆరోగ్యానికి మంచిది కాదు మైడియర్ ప్రసాద్! రాత్రి ఈ పర్సుని నా దగ్గిర పోగొట్టుకున్నావు. పర్సులో ఆరొందల యిరవై రూపాయిలున్నాయి. అఫ్‌కోర్స్—ఇరవై నేను వాడుకున్నాను. మిగతా ఆరొందలూ పర్సుతో సహా పట్టుకొచ్చేను. ఇకనుంచైనా డబ్బు విషయంలో జాగ్రత్తగా వుండు.'

అప్పుడు రాం ప్రసాద్ పకపకా నవ్వేడు నవ్వు ఆపి అన్నాడు—

'వెల్. ఇందుకా నీ ప్రయాణం ఆపుకున్నావు. యూమేడ్!

ఆ డబ్బు కావాలనే నీ దగ్గిర పోగొట్టుకున్నాను, కనక మిగతా ఆరొందల పర్సూ నీది. హేవిట్!'

'నా కెందుకింత డబ్బు!' అన్నది లిల్లీ ఆశ్చర్య పోతూ.

'అది నాయిష్టం. పోతెత్తకుండా పర్సు తీసుకో, బసవరాజు దగ్గిర నా గురించి మంచి చెప్పు. ఆ సహాయం చాలు.'

'అంటే ఇది లంచమా?'

అతను రెండు చేతుల్నీ గాల్లోనూపి, గుప్పెలుగా బిగించి మృదువుగా అన్నాడు.

'నీ యిష్టం, నువ్వేమైనా అనుకో. ఆ పర్సునీది. అంతే'

లిల్లీ కళ్ళతో నవ్వేసి, పర్సు పుచ్చుకుని చిలిపిగా అన్నది—

'నీది మాస్టర్ బ్రెయిన్ మైడియర్?'

(రెండో భాగం పైవారం)

'అరగంటకొక కార్డు కొనకపోతే ఒక్కసారే కొనుక్కోకూడదూ?'





# స్వాతంత్ర్య చిహ్నాలు



అంతా వుట్టిది - ఆయన చెయ్యి స్వాతంత్ర సమరంలో పోలేదు - వాళ్ళావిడ విరక్కొట్టింది!




స్వాతంత్ర్యం రాకమునుపు మా ఆవిడా నేనూ కలిసే వున్నాం - తర్వాత విడాకులిచ్చుకొని చెరో పార్టీలో జేరిపోయాం!




ఖద్దరు తొడగటం బాధనిపించి రాజకీయాల్లోంచి తప్పుకున్నాను!




ఇప్పుడు నా దగ్గర రాట్నం ఎక్కడుందో? స్వాతంత్ర్యం వచ్చిం తర్వాత ఎక్కడో మూల్న పడేసి నట్టున్నాను




నేను స్వాతంత్ర సమరంలో పాల్గొని జైలుకెళ్ళలేదని - ఏదో వెధవ పని చేసి జైలుకెళ్ళానని ఎవడ్రా నీకు చెప్పిందా రాస్కెల్?
మీ ఆవిడ నాయనోయ్!




మన దేశ స్వాతంత్ర్యం గురించి, జెండా గురించి, గాంధీ గురించి, నెహ్రూ గురించి ఈయన చెప్పేదంతా నా తెలుగు వాచకంలో ఉంది నాన్నా! అదే ఇది! నిజం!!

## సీరియల్

# పూర్వా సంధ్యా ప్రవర్తతే...

### తేజోవతి

**జరిగిన కథ**

శంకరం శాస్త్రి ప్రభావంవల్ల వేణు ప్రవర్తన పూర్తిగా మారిపోయింది. అతను ఆక్స్‌ఫర్డు స్కూల్లో స్కూలు ఫైనలు పాసయ్యాడు. శంకర శాస్త్రిగారు కేసులో యిరికిద్దామని వేసిన పథకం రాజారావు పథకాన్ని వేణు విఫలంచేస్తాడు వేణు అక్కయ్య జ్యోతి ప్రాణస్నేహితులయిన జ్యోతి, రమణలు చాలకాలానికి కలుసుకుంటారు పార్టీ రాజకీయాలతో విరోధవర్గాలయిన కుటుంబాలు వాళ్ళవి జ్యోతి రమణ ఇంటికి వెళ్ళడాన్ని జ్యోతిభర్త ఆనందరావు సహించలేకపోయాడు మాటమాట పెంచుకుని మళ్ళీ సర్దుకుపోతారు వేణు కాలేజీలో చేరాడు. జ్వరంతో పరీక్షలు రాస్తాడు. సెలవుల [illegible] సుశీలను చూడ్డానికి అక్కగారింటికి వచ్చి, ఆమెకు చదువు చెప్పడానికి జ్యోతిని నియోగిస్తాడు

## 17

శారద రేపిన ఆలోచనలు మాత్రం పార్వతి తలలో తిరుగుతూనే వున్నయి.

'అత్తయ్యా! జడవెయ్యవూ? నేను బడికి వెళతాను' అంటూ ముందొచ్చి కూర్చున్న రాధకు జడఅల్లి పంపించే సరికి మధ్యాహ్నం పాలు రానే వచ్చినయి. పుస్తకాలు తీసి అవతల పెట్టి యిక మళ్ళీ పనులు చేసుకోడానికి లేచింది పార్వతి

అంతదాకా నిద్ర నటిస్తున్న శంకరంగారు, 'హూఁ' అనుకున్నారు బరువుగా.. లేచారన్న మాటేగాని ఆయన ముఖం ప్రశాంతంగా లేదు. ఇన్నాళ్ళుగా ఆయనకు తెలియని ఎన్నో నిజాలు యివ్వాళ బయటపడ్డయి. పార్వతి చదువుకు తమ యింట్లో ఎటువంటి సహకారం లభిస్తున్నదో, ఆయన కింత దాకా తెలియనే తెలియదు. అన్నిటి కంటె పార్వతికి వుద్యోగం చెయ్యాలనే అభిప్రాయం వెలిబుచ్చడం ఆయనకు మరీ బాధాకరంగా వుంది....

'సుకుమారంగా పెరిగిన పార్వతి వుద్యోగం చెయ్యాలా? ... చివరికి ఈ దరిద్రం భరించలేక [illegible] సాయం చెయ్యాలనుకుంటోందా?... [illegible] యింతా చదువుకుని... భార్యను [illegible] పోషించలేని అధమస్థితిలో వున్నాడన్నమాట...' స్త్రీలు బయటికి రాకూడదనో లోపలే వుండాలని మొదలైన అభిప్రాయాలు లేవు ఆయనకు. ఉద్యోగం చేసుకుంటున్న స్త్రీలను చులకనగా కూడా చూడ లేదాయన...ఆయన బాధల్లా ఒక్కటే!

ఉద్యోగం చేసుకుంటున్న స్త్రీలను అందరూ చులకనగా చూస్తారని, ఎదుట 'ఓహో' అంటూ వూనుకు తిరిగినా చాటున 'అదీ యిదీ' అని చులకనగా చూస్తారని ఆయన బాధ. ఆయనే పార్వతిని ఎంతో గౌరవంగా సంబోధిస్తారు. కనీసం పొరబాటున కూడా 'అది' యిది, దాన్ని' లాంటివి అని ఎరుగరు. ఆయన దృష్టిలో భార్య భర్తనే కాదు, భర్త భార్యను కూడా గౌరవించాలి. అలా గౌరవించ గలిగినపుడే, ఆ భార్యకు సమాజంలో గౌరవనీయమైన స్థానం లభిస్తుంది — అంటారాయన. అటువంటిది ఎవరో ముక్కూ మొఖం తెలియనివాళ్ళంతా తేలిగ్గా మాట్లాడితే ఆయనెలా సహించ గలరు?...

శంకరంగారికి యింత దాకా లేని ఒంటినొప్పి నిజంగానే వచ్చేసింది. కణతలు నొక్కుకుంటున్న శంకరం గారికి కాఫీ తెచ్చియిస్తూ. 'ఒంటినొప్పి యింకా తగ్గలేదా?' అని మృదువుగా అడిగిన పార్వతికి మౌనంగా తలూపి వూరుకున్నారు. ఆలోచనలతో తలబ్రద్దలై పోతున్నట్లుగా వున్నా... ఆలోచించడం మానలేదాయన...

ఒక్కొసారి పరిస్థితులు ఎదురు తిరిగినప్పుడు, జీవితంలోని ఆశయాలు అర్థ రహితమైన వనిపిస్తయి...సరిగ్గా ఆయన పరిస్థితి యిప్పుడలాగే వుంది. ఈనాటివి ముఖపెట్టలేని ఆశయాలకు తిలోదకాలు యివ్వటమే మంచిదేమో ననిపిస్తోందాయనకు. మనసు గుంజాటం పడిపోయింది. క్రమ క్రమంగా అంతరాత్మకూ మనసుకూ జరుగుతున్న సంఘర్షణా అంతమైంది; ప్రకృతిలో గూడా వెలుగు మాయమై చీకటి రాజ్యం చేపట్టింది.

శంకరంగారి మౌనం భరించలేకపోయిన పార్వతి ఏన్నోసార్లు ఏదో అడగబోయి అడగలేక వూరుకుంది, ఆ గంభీర ముద్రను చూసి

'ఎందుకో యివాళంతా అదోలా వున్నారు?' భోజనాలయ్యాక పక్కమీద మేను వాలుస్తూ ధైర్యం చేసి అడిగింది పార్వతి

'ఏం ఎలా వున్నాను?' అప్పుడు కూడా అదే గంభీరత

'ఏదో ఆలోచిస్తున్నట్లున్నారు తీవ్రంగా...'

'నేను కూడా కొన్ని ట్యూషన్లు చెప్పుకుంటే బాగుండునేమోనని ఆలోచిస్తున్నాను.'

'ట్యూషన్లు చెబుతారా!!' పక్కమీంచి లేచి కూర్చుని వింతగా అడిగింది.

'ఆఁ .అదే మంచిదేమో నా వాళ్ళందర్నీ కనీసం రెండోపూట కాఫీకి కూడా గతిలేని స్థితిలో వుంచేకన్నా...'

పార్వతి వులిక్కిపడింది తను రాజాకు చెప్పేటప్పుడు యీనాయనకు మెళకువ రాలేదుగదా...అనుకుంది . తర్వాత యిదే మంచి అదను తన అభిప్రాయం బైట పెట్టడానికని .... 'మన ఆశయాలను బలిపెట్టి అంతరాత్మకు విరుద్ధంగా నడుచుకునే కంటె యీ యిక్కట్లు దాటడానికి మరో మార్గాంతరం అన్వేషించ గూడదా?' అంది

'అంటే నీ వుద్దేశం?' ఆయన మాట గానే అడిగారు

'ఏం లేదు. పద్దెనిమిది రోజులు పడతాయి. ఈ రెండు మూడేళ్ళు ఓపికపడితే, బి. ఏ. అవగానే నేనూ ఏదన్నా వుద్యోగం చూసుకుంటే, ఆర్థికంగా యిబ్బందులు వుండక్కర లేదుగదా అని..'

'ఉద్యోగం చేస్తావా? ... [illegible] చంపుకుని మాటవరసకూ [illegible]

నేనుండగానే ఆఫీసుల చుట్టూ తిరుగుతావా? నేనింకా బ్రతికే వున్నాను పార్వతి బ్రతికే వున్నాను.' అన్నారు ఆయన యింత దాకా లోలోపల పడుతున్న బాధను, ఒక్కసారిగా వెళ్ళ కక్కుతూ...

'హూ...ఇంత చదువుకున్నవారు, యింత సంస్కారమున్న వారు, మీరు కూడా యింత కంటె ఎక్కువగా ఆలోచించలేక పొయ్యారన్నమాట!...' అంది విచారంగా పార్వతి... 'అర్ధాంగివి' అన్నారు. 'ఓహో' అనుకున్నాను?' 'సహభాగినివి' అన్నారు. నిజమే ననుకున్నాను. రాత్రి మీరన్నారు జ్ఞాపకం వుందా? మనిద్దరం కష్టాల్నీ, సుఖాల్నీ సరిసమంగా పంచుకోవాలని, అలా పంచుకోకపోతే మరోవిధంగా మీ మనసును చిత్రవధ చెయ్యడమేనని ...' రుద్ధ కంఠంతో పార్వతి అంటుంటే, శంకరంగారు ఏమీ మాట్లాడలేదు...

ఒక్క క్షణముండి మళ్ళీ అన్నది పార్వతి, 'కానీ—యివ్వాళ తెలిసింది మీ 'అర్ధాంగి'కి అర్ధం! ... మీరు పెట్టింది తింటూ, మీరు చెప్పింది వింటూ వుండడమే అర్థమని...ఏం నాకు మాత్రం మనసు లేదనుకున్నారా ? నాకు మాత్రం భర్త కష్టాల్లో పాలు పంచుకోవాలని వుండదనుకున్నారా? అలా పంచుకో గల్గినప్పుడే నాకూ తృప్తి, ఆనందమూ కలగవా?... హూ...మీ ఆశయాలకు తిలోదకాలు యివ్వగలరు!... మీ అంతరాత్మను చంపుకోగలరు! కానీ, మీ అర్ధ శరీరం సహాయం మాత్రం అందుకోరు...అసలు మీరు నన్ను మీదాన్నిగా భావించుకో గల్గితే, నా సహాయం తీసుకోడానికి ఎందుకింత సంశయిస్తారు?...' అంటూ పార్వతి ఆ ఆవేశంలో హద్దులు కూడా మర్చిపోయి మాట్లాడింది పెద్దగా...

'ఉష్!...నెమ్మదిగా మాట్లాడు పార్వతీ! నేను చెప్పేది అదికాదు.'

'మరి మీరు చెప్పేది ఏమిటి చెప్పండి... ఆనాటి శ్రీరామచంద్రుడి మొదలు, మొన్నటి రామకృష్ణ పరమహంస దాకా, భార్య సహాయం లేకుండా ఏ మహనీయుడు తన ఆశయాలను సాధించుకున్నాడు చెప్పండి... అసలు మీ ఆశయాలు నా ఆశయాలు కావా? వాటిని సాధించడం కోసం మీతో బాటు నేనూ చెయ్యగలిగింది చెయ్యాలని వుండదా? మంచో చెడ్డో ఒక్కొక్కళ్ళకు కొన్ని కొన్ని అభిప్రాయాలుంటయి. మీరు నాకోసం మీ మనసుకు నచ్చని పని చేస్తుంటే నేను సుఖంగా కూర్చుని కులుకుతూ తినగలనని ఎలా అనుకున్నారు...'

శంకరంగారు ఏం మాట్లాడకుండా ఆలోచనలో పడిపొయ్యారు. ఏమీ ఎరుగనట్లు కన్పించే పార్వతిలో ఇన్ని వ్యూహాలు వున్నయ్యా?...ఇన్ని ఆలోచనలు వున్నయ్యా, అనుకుని ఆశ్చర్య పోతున్నారాయన.

పార్వతి కాస్సేపాగి మళ్ళీ అంది.' 'లేదూ ఇలాగే గడుపుదామంటారా ... మంచంలో వున్న మీ అమ్మగారికి యిప్పటికే సరిగా మందు తెప్పించలేక పోతున్నాం ... మీ అక్కగారి పిల్లలు పెద్ద వాళ్ళవుతున్నారు... వాళ్ళకు చదువులు, పెళ్ళిళ్ళ చెయ్యాల్సిన బాధ్యత మీదేనని మర్చిపోకండి ... రోజా రోజుకు పెరుగుతున్న ధరలు...మీ రన్నీ బాగా ఆలోచించండి...'అంది పార్వతి.

'కాదు పార్వతీ!...నే చెప్పేది విను.' చాలా శాంతంగా అన్నారు శంకరంగారు, 'అర్ధాంగి సహాయం చేస్తే చిన్నతనమనికాదు నేనదన్నది...ఉద్యోగం చేసే స్త్రీలను తోడి



# హా ర్యా సంధ్యా ప్రవర్తతే..

వుద్యోగులు అంత గౌరవంగా చూడరు... అదీకాక వుద్యోగం చేసే స్త్రీలను చూస్తూన్నాంగా. వాళ్ళు పాపం ఎన్ని సమస్యలను ఎదుర్కోవలసి వస్తున్నదో?'

'ఓష్!...అదా!...ఇదివరలో ఒకసారి మీరే అన్నారు గుర్తు తెచ్చుకోండి...'గౌరవం అనేది ఒకరు యిచ్చేదీ ఒకరు పుచ్చుకునేదీ కాదని! అది మనంతట మనం సంపాదించుకో వలసిందనీ...స్వతహాగా నాకా సామర్థ్యం లేకపోయినా యిన్నాళ్ళ మీ సాహచర్యంలో నైనా ఆ మాత్రం గౌరవం నిలుపుకోలేనంటారా?...ఇకసమస్యలంటారా? సమస్యలు లేనిది ఎందులో చెప్పండి. ఒకదాని తర్వాత ఒకటిగా ఎదురయ్యే సమస్యలనే చిక్కులు విడదీసుకుంటూ పోవడమే జీవితమేమోనని మీరే అన్నారు ఒకసారి...' అంది కాస్త శాంతించిన పార్వతి.

శంకరంగారికి ఓ క్షణం ఏమనడానికీ తోచలేదు. పార్వతి ఆశయాల్లో తప్పు లేనప్పుడు ఒప్పుకుంటేనేం అనిపించిందాయనకు...పార్వతిని దగ్గరకు లాక్కుంటూ, 'పార్వతి అంటే ఆదిశక్తి గదా...ఆదిశక్తికి అడ్డెవరు చెప్పగలరు?...పార్వతిదగ్గర శంకరుడేనాడు గెలిచాడు గనుక!' అన్నారు లాలనగా.

పార్వతి ఆయన ఒళ్లో ఒదిగిపోతూ అంది, 'ఆ భగవంతుడికి నేనెంతో ఋణపడి వున్నాను.'

'ఎందుకో?!'

'మీ లాంటి భర్త నిచ్చినందుకు...' ప్రేమగా ఆయన కళ్లల్లోకి చూస్తూ అంది.

'ఏది! కడుపునిండా తిండి, కట్టుకోడానికి బట్టా యివ్వలేని భర్త నిచ్చినందుకా ఋణపడి వుండడం!'

'అదుగో...అదే అనొద్దు...భోగభాగ్యాలు కాదు ముఖ్యం. అర్థం చేసుకోగల భర్త లభించడంకంటె ఆడదానికి వేరే అదృష్టం లేదు.'

'ఊఁ...' అంటూ ఆమెను తన కౌగిట్లో బంధించారు శంకరంగారు.

మరునాడు సాయంత్రం శంకరంగారు అప్పుడే స్కూలునుండి వచ్చి తోపల కడుగు పెట్టున్నారు. వంట యింటోంచి మాటలు వినబడుతున్నాయి. 'ఏం చేసేది చెప్పమ్మా? వాడు దానిచేతిలో కీలుబొమ్మయికూచుండె. ఇరుగుపొరుగు వీళ్ళరయినా 'అయ్యో పాపం అంటున్నారుగానీ...' సీతమ్మగారి వాక్యం పూర్తికాక మునుపే ముందు గదిలో చెప్పుల చప్పుడు విన్పించేసరికి అంతటితో ఆపేసింది....అంతదాకా కూచున్న పక్కింటావిడ 'వస్తానమ్మా...ఇంట్లో బోలెడు పనుంది...' అంటూ వెళ్ళిపోయింది.

'అక్కయ్యా! పార్వతి లేదా?' కండువా మధ్యగదిలో వంకెకు తగిలిస్తున్న శంకరంగారు అడిగారు.

'లేదు.' ముక్తసరిగా జవాబిచ్చింది సీతమ్మగారు.

'ఎక్కడికి వెళ్ళింది?'

'ఏమో ఎవరికి చెప్పింది గనుక? మధ్యాహ్నమనగా వెళ్ళిందిట. ఇంతదాకా అంతూ పొంతూ లేదు.'

శంకరంగారు మాట్లాడకుండా దొడ్లోకి వెళ్ళి కాళ్ళూ చేతులూ మొఖం కడుక్కొచ్చారు. తల్లి మంచంలో నిద్ర పోతున్నది ... పిల్లలు ఎక్కడికో ఆడుకోడానికి వెళ్ళారు. శంకరంగారు మొహం తుడుచుకుంటూ వంటయింట్లోకి వచ్చారు. సీతమ్మగారు మరదలుమీద కోపమంతా విసనకర్ర మీద చూపిస్తూ కుంపటిముందు కూచుని విసురుతోంది.

'ఏమిటో చేస్తున్నావక్కా?...' శంకరంగారు నెమ్మదిగా సంభాషణకు నాందీ ప్రస్తావన చేశారు.

'బియ్యం కడిగి పడేశాను... మరి ఆవిడగారు వూళ్ళు తిరిగొచ్చేదాకా పిల్లలు ఆకలికి వుంటారా? ...' అంది సీతమ్మగారు కోపంగా...అసలు రోజూ సాయంత్రం వంట పార్వతిచేస్తుంది...ఇవ్వాళ పార్వతి యింట్లో లేకుండా పోయిందన్న కసితో ఆవిడలా అంది ... అక్కగారి ఆగ్రహంచూసి నవ్వుకున్నారు శంకరంగారు.

'అక్కా!...పార్వతి చదువుకోడం నీకిష్టం లేదా?...' యీదాలాపంగా అడిగినట్లే అడిగారు.

'డబ్బు పెట్టేవాళ్ళు పెడుతున్నారు... చదువుకునేవాళ్ళు చదువుకుంటున్నారు ... మధ్యలో నా యిష్టాయిష్టాలతో ఏంపని?'

'పార్వతి చదువుకుంటున్నదంటే తమాషాకు చెదవటంలేదక్కా...ఇంటిపనులు చూసుకుంటూ చదువుకోడమంటే తమాషా కాదు...ఎంత శ్రమో నీకు తెలియదక్కా... ఒక్కగంట చదువుకుంటే రెండుగంటలు బరువుపనులు చేసినంత అలసట వస్తుంది... పార్వతి చూడు. రోజురోజుకూ తగ్గిపోతోంది ... తను ఎందుకింత కష్టపడుతోందనుకుంటున్నావ్?'

'తిని కూర్చోలేక ... ' ఇదీ ఆవిడ వుద్దేశం!...

తిని కూర్చోలేక కాదక్కా ... కాలం మారుతోంది... ఇంట్లో ఒకరి రెక్కమీద, ఒకరిసంపాదనమీదా కాలం గడుపుకురాగల్గిన రోజులు పోయినయి. ఇప్పటికే ఒక్కపూట తింటే, ఒకపూట అర్ధాకలితోవుంటున్నాం... ఇక ముందు సంగతి ఆలోచించు. అమ్మ ఆరోగ్యంచూస్తే అలా వుంది! ... నీ పిల్లలిద్దరూ పెద్దవాళ్ళయి చదువులకు వస్తే ఏమాత్రం చదివించగలను చెప్పక్కా ... ఒకపూట పస్తుండి, మహాఅయితే యీ పరిస్థితుల్లో రాజును ఎస్సెల్సీదాకా చదివించగలనేమో...వాకైతే ప్రస్తుతం ఏ జంజాటం లేదనుకో...' బాబును తల్చుకోగానే ఆయన కంఠం రుద్ధమైంది...

కాస్సేపాగి మళ్లీ అన్నారాయన ... 'మేము ఆలోచిస్తున్నది నీ పిల్లల్నిగురించే... రాధకు పెళ్లిచెయ్యాలా?...రాజును చదివించాలా?... ఇరుగూపొరుగు వాళ్ళు కబుర్లు చెప్పేవాళ్లేగానీ, నీ పిల్లలకు సాయం చెయ్యగలరా? ... నా సంపాదనలో యివన్నీ సక్రమంగా చెయ్యగలనన్న నమ్మకం నాకులేదు... 'ఫర్వాలేదు...రాజుకు స్కూలు ఫైనలు చదువు చాలు...రాధ పెళ్లి సంగతి మీరు దిగులు పడక్కరలేదు ... ' అంటూవా ... చెప్పు... యిప్పటికిప్పుడు పార్వతిచదువు మాన్పిస్తాను.' అన్నారు ... మామూలుగా ఆయన ఎంత మెత్తగా మాట్లాడుతారో, అవసరం వచ్చినప్పుడు కర్కశంగానూ, నిక్కచ్చిగానూ మాట్లాడగలరాయన...సీతమ్మగారు తమ్ముడు చెప్పిన విషయం ఆలోచిస్తోంది. ఆవిడ కింత దాకా ఈ విషయం తట్టనేలేదు. పార్వతి చదువుకుంటున్నదంటే, తనను కించపరుస్తున్నట్లు భావించింది. దానికి ఓర్వలేని యిరుగూ పొరుగూ మరోనాలుగు పుల్లవిరుపు మాటలు జోడించి, మండే కట్టెను ఎగసన దోశారు. అంతే. ఆవిడ లోతుపాతులు

# పూర్వాసంధ్యా ప్రవర్తతే...

తెలియకుండా, సమయం దొరికినప్పుడల్లా విరుచుకు పడుతోంది పార్వతివిషాద.

అక్కయ్య వివాహిత పోవడంతో శంకరంగారే మళ్లీ అందుకున్నారు.

'పార్వతి బాధ్యత తెలిసిన వ్యక్తి అక్కయ్యా...అందుకే మన కుటుంబాన్ని ఆర్థికంగా ఆదుకోవాలని తాపత్రయపడుతోంది. అహర్నిశలూ అందుకే శ్రమ పడుతోంది... ఒక్క విషయం అక్కయ్యా ... ఒక పనిని ఒకళ్లు సాధించ పూనుకున్నప్పుడు... యింట్లో అందరూ సహృదయంతో సహకరించినపుడే వాళ్లు సాధించగలరు ... నేను చెప్పిన విషయాన్ని నువ్వు బాగా యోచించుకొని ఏమాటా నాకు చెప్పెయ్ ... నే నెప్పుడూ నీ మాట కాదనలేదుగా...' అని వెళ్లిపోయ్యారాయన.

ఓ రెండు నిముషాలకు పార్వతి వచ్చింది చేతిలో పుస్తకాలతో... 'ఎక్కడకు వెళ్లావు పార్వతీ?' గుమ్మంలో కడుగు పెడుతుండగానె అడిగారు శంకరంగారు.

'శారదా వాళ్ల యింటి కెళ్లాను...అది తన స్నేహితురాలి దగ్గర 'జూలియస్‌సీజరు', దాని 'గైడు' యిప్పిస్తానంటే, తనతో బాటు అగ్రహారం వెళ్లి పట్టుకొస్తున్నాను. గ్రూపులో 'ఎడ్వాన్సుడ్ యింగ్లీషు' పుస్తకాలు కూడా యిచ్చింది.'

'అంత దూరంపడి పోకపోతే నాతో చెబితే కొనుక్కొచ్చేవాడినిగా?'

'ఎందుకులెండి డబ్బు దండుగ ? ... చదువుకొని యిచ్చేస్తానంటే 'సరే' అంది. అరె! వదినా! ... నే వచ్చి వండేదాన్నిగా... ఎక్కడో అగ్రహారం కదూ...నడిచొచ్చేసరికి ఆలస్యమైంది...' అంటూ వదినగారు వంట చెయ్యడం చూసి నొచ్చుకుంటూ, పుస్తకాలు అక్కడ పడేసి వంటింట్లోకి వెళ్లింది పార్వతి...

'ఎవరుచేస్తే ఏముందిలేమ్మా... పొద్దుపోతుందని బియ్యం కడిగి పడేశాను...' అన్న వదినగారి మాటలు, ఆగ్రహంతో వున్నవో, అనుగ్రహంతో వున్నవో అర్థంకాని పార్వతి కొంగు పక్కకు దోపి తన పనుల్లో పడిపోయింది.

* * *

'ఏమిటి రమణయ్య బాబాయ్!...ఏమిటి విశేషాలు?' రచ్చబండమీదకొచ్చి కూర్చుంటూ అడిగాడు ఆనందరావు, అక్కడే వున్న రమణయ్యను. సాయంత్రమైందంటే సహజంగా వాళ్ల పార్టీ పెద్దలంతా అక్కడే చేరుతారు.

'ఓహో...ఎప్పుడేంటి రావడం హైదరాబాద్ నుండి?'...వోట్లో చుట్ట తీసి తుపుక్కున వుమ్మేసి అడిగాడు రమణయ్య.




'ఓ గంటయిందేవో వచ్చి...మన ప్రెసిడెంటు సంగతి లాయరుతో మాట్లాడి వచ్చాను. ఈ రెండురోజుల్లో విశేషాలేమిటి?' అని అడిగాడు ఆనందరావు.

'విశేషాలకేం ... ఆ వెంకట్రావు శర్మ మేష్టారి యింటికెళ్లి మాట్లాడి వచ్చాట్ట'...

'శర్మ మేష్టారితో అంతపనే మొచ్చిందబ్బా?'

'సోషల్ వెల్‌ఫేర్ గ్రాంటులో పిల్లాడికి తలో ఐదురూపాయలు యిస్తారుగా...వాటికి అప్లికేషన్లు పంపమన్నారుట సమితివాళ్లు... ఆవిషయం పసిగట్టి యింటికెళ్లి వెళ్లి, కొంతమంది హరిజనుల పిల్లలపేర్లు యిచ్చి, 'వీళ్లకు తప్పకుండా వచ్చేట్టు చూడమన్నాట్ట... దానికతడు 'నా బాధ్యత నేను నిర్వర్తించుకుంటాను. ఇందులో ఒకర్ను చెప్పాల్సిందీ, నేను వినాల్సిందీ ఏమీ లేదు' అన్నాట్ట.'

'అతడసలే కొరకరాని కొయ్యముక్క ... అయినా వున్నట్టుండి హరిజనులమీద అభిమానం పుట్టుకొచ్చిందేం యీ వెంకట్రావుకు?'

'ఈమధ్య వాళ్ళను మంచి చేసుకుంటున్నాడుగా ... వాళ్లనేగా అప్పుడు తాగించి పంపి, మనపిల్లలు నాటకం వేస్తుంటే, అల్లరి చేయించింది.'

'నాటకం మధ్యలో రాళ్లు రువ్వి గొడవ చేసింది వాళ్లా...?' అన్నాడు ఆనందరావు ఆశ్చర్యపోతూ...

'మరెవరనుకున్నావ్!... నేనంతా కూపీ తీశాగా?...వాళ్ళపార్టీ మనుషులైతే మనం గుర్తుపట్టి లోపలికి రానివ్వమని, హరిజనులను మంచిచేసుకుని వాళ్ళద్వారా చేయించాట్ట ... ఆ తర్వాత యిప్పుడిట్లా మంచిచేసుకుంటున్నాడన్నమాట వాళ్లదగ్గర మెహర్బానీ సంపాయించడానికి...'

'ఊఁ...' తల పంకించాడు ఆనందరావు. అతడట్లా అన్నాడంటే వాళ్లకేదో మూడిందన్నమాటే...'ఆశర్మ బ్రహ్మరుద్రాదులొచ్చి చెప్పినా, తనకు తోచింది తప్ప చెయ్యడు. ఆస్కాలుసంగతి నేను ఆఫీసులో చూసుకుంటానుగానీ, మన రామ్మూర్తి స్కూలుకు గూడా వచ్చుండాలే... ' ... పాలోచనగా అన్నాడు ఆనందరావు.

'రామ్మూర్తిని పిలిపిద్దాం...' అంటూ

అటు వెళుతున్న ఓ కుర్రాడ్నిపిలిచి రామ్మూర్తి పంతులుకు కబురు పెట్టాడు రమణయ్య.

క్షణంలోవచ్చి వాలాడు రామ్మూర్తి, తన కుడిభుజంలాంటి దైవసహాయంతోసహా, 'ప్రెసిడెంటుగారు ఎందుకో రమ్మన్నారుట?' అంటూ.

'సమితి ఆఫీసునుంచి ఏవో అప్లికేషన్లు పంపమని వచ్చిందిటగా?...'

'ఆ ... నిన్ననే వచ్చిందండీ ... హరిజనుల, వెనకబడ్డ జాతుల పిల్లల తల్లి దండ్రులదగ్గరనుండి అప్లికేషన్లు తీసుకుని పంపమని...'

'పంపారా?'

'తమచెవిని మాటమాత్రం వెయ్యకుండా ఎట్లా పంపుతామండీ!...' వినయం పుట్టి పడేలా అన్నారు దైవసహాయం మేష్టారు...,

'కాలపరిమితి ఏమన్నావుందా?...' ఆనంద రావు ప్రశ్న...

'ఆ ... వుందండి ... మనకు ముఖ్యమైనవాళ్లు ఎవరన్నా? ... ' భావగర్భితంగా చూశాడు రామ్మూర్తి ఆనందరావు మొఖంలోకి.

'ఆ... ఏంలేదు... ఆ వెనకబడ్డ జాతుల వాళ్ళ అప్లికేషన్లు సకాలంలో పంపించండి...మిగతావి నే చెబుతాను.'

'అట్లాగే తమమాట కాదంటానా...!' ఇద్దరూ వినయంగా నమస్కరించి వెళ్ళి పొయ్యారు.

*        *        *

'ఆ సోషల్ వెల్ ఫేర్ గ్రాంట్సుకి అప్లికేషన్లు పెట్టి ఆరునెల్లు కావస్తోంది. అటుకేసి వెళితే, పిల్లలకు పలకా పుస్తకం చొక్కా లిస్తారన్నారు ఏవండీ' అని అడుగుతున్నారు వెంకట్రావూ?...' అన్నాడు నరసింహం! నరసింహం అంటే వెంకట్రావు తలలో వాలుకలాంటి వాడు ... సాయంత్రమైతే ఆనందరావు పక్షం వాళ్లు రచ్చబండమీద చేరినట్లు, వెంకట్రావు పక్షం వాళ్లంతా వాళ్లింటి ముందున్న అరుగుల మీద సమావేశ మవుతున్నారు.

'సరేలే...సోషల్ వెల్ ఫేర్ గ్రాంట్సు సంగతి నీకింకా తెలియదు మావా! ... అవి అన్నీ మన పిల్లలచేతి కొచ్చేసరికి, అప్లికేషన్సు పెట్టుకున్న వాళ్లల్లో చాలామంది, ఎలిమెంటరీ స్కూల్ వదిలి, హైస్కూల్ కి కూడా వెళుతారు...' అన్నాడు నవ్వుతూ వెంకట్రావు.

'అదంతా నీ పిచ్చయ్యా వెంకట్రావ్! అసలు విషయం ఏమిటంటే మనం యీ విషయంలో శ్రద్ధ తీసుకుంటున్నామని ఆనందరావుకు తెలిసిందిట ... మరి ఏం మాయచేశాడోగానీ యిది అతడి పనేనని, నాకు గట్టినమ్మకం...' అని తన వూహను వెలిబుచ్చాడు నరసింహం...

'ఏమో మావా నేను నమ్మలేను...చిన్న పిల్లల విషయంలో అంతపని చేస్తాడంటావా ఆనందరావు?'

'నామాట నిజమో అబద్ధమో కొన్నాళ్లకైనా తెలుస్తుందిగా ... ఇంతకూ యీ సంగతి విన్నావ్?... ఆ రవణయ్యా వాళ్లకు బి. ఎమ్. ఎస్.లోను యిప్పిస్తున్నాట్ట ఆనందరావు!...'

'రవణయ్యా వాళ్లకా!...వాళ్ల కిదివరలో రేకులనీ, బావులనీ లోన్లు చాలా యిప్పించాడుగా ? ... రెండేళ్ల క్రిందట ఐఎమ్మెన్‌లోను గూడా తీసుకున్నాడు 'రవణయ్య ... అదేం తీర్చినట్టు వినలేదే మళ్లీ ఎట్లా యిస్తున్నారయ్యా!...'

'మరి ఎందు కనుకున్నావ్ నే చెప్పింది! ఇప్పుడు యిది పడనీకుండా చెయ్యాలంటే ఒక్కటే వుపాయం...ఇట్లా అని పై అధికారులకు ఓ పిటీషను పడేస్తే సరి' అని సూచించాడు నరసింహం. వెంకట్రావు పనులకు ప్లానులకు నరసింహమే మూలం...

'నిజమే! మావా!...చక్కగా చెప్పావ్!... అట్లా చేస్తే సరి...ఎంక్వయిరీ చేయిస్తారు. పిటిషనువస్తే...అప్పుడు యీ రవణయ్య కివ్వాల్సిన విత్తనాలు తక్కువపుతుంది ... నిజమే మనకు దక్కనివి వాళ్ల కెందుకు దక్కాలి.' అన్నాడు వెంకట్రావు. నరసింహం ఆలోచనలను ఆచరణలో పెట్టడానికి పదును కడ్తా...

అటే పోతున్న మీసాల కిష్టయ్య, అరుగు మీద వాళ్లను చూసి వాళ్ళ దగ్గరగా వచ్చి, అరుగుమీద కూచుంటూ 'అవునయ్యా వెంకట్రావ్! ... 'అప్పుడు మన పొలాల మధ్యగా రోడ్డు వేస్తున్నారంటే, నేచూస్తున్నావ్!...ఏ మయిందేమిటి?' ఆ సక్తితో అడిగాడు.

'ఏమవడ మేముంది కిష్టయ్యాబావా!... 'మన పొలాల్లో మంచి వాణిజ్య పంటలు, కూరగాయలూ మొదలైనవి పెంచుతున్నామని, మనవి మంచి భూసారం కలిగిన భూములనీ, వీటి మధ్యగా రోడ్డు వేస్తే పంటలు దెబ్బతిని, అధికాహారోత్పత్తికి నష్టం వాటిల్లుతుందనీ, పిటీషను మీద పిటీషన్లు కలెక్టరుగారికి, అగ్రికల్చరు ఆఫీసరు గారికీ గుప్పిస్తూ, చింతలతోపూ, తాటితోపూ పక్కనుంచి రోడ్డు వేస్తే బాగుంటుందని సూచించడంతో 'రోడ్డు' కోసెడు దూరం పెరుగుతుంది. ఎస్టిమేషను పెంచాలి. వచ్చే ఏడు చూద్దా' మని వాయిదా వేశారుగా మన సూపరువైజరుగారు !...'

'నాసామిరంగా !...భలే జేశావ్ లే !... లేకుంటే మన పొలాల్ని అడ్డానికి తెగనరుకుతా రోడ్డు వేయించి, అంటూ తెగ డప్పాలు కొట్టాడే ఆనందరావు!...ఇప్పుడు చెప్పమను...' అన్నాడు ఆనందాతిరేకంతో కిష్టయ్య.

(ఇంకా వుంది)



# వారఫలం

## 18-8-1967 శుక్రవారం మొదలు 24-8-1967 గురువారం వరకు.

**మేషం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి. ప్రయాణంద్వారా కార్యసాధన చేయుగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభిస్తాయి. వారాంతంలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. మీ తాలుకు వస్తువులు పోవచ్చును.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృషభం:** ఇదివరకు మీ కార్యక్రమాల్లో యేర్పడిన అవరోధాలు తొలగి పోతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వృత్తిలో అనుకూలవార్తలను వింటారు. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకుంటాయి. సాహసముతోకూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యాపారంలో నూతన అవకాశాలు లభిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కర్కాటకం:** పూర్తిగా నెరవేరేవరకు యే వ్యవహారాన్ని నమ్మడానికి అవకాశం లేదు. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. వారం మధ్యంలో అన్ని వ్యవహారాల్లోను ఆందోళన కలిగించే పరిస్థితి యేర్పడుతుంది. ప్రయాణాల్లో శ్రమకలుగుతుంది. నూతన వ్యవహారాల్లో నష్టం వస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**సింహం.** ఫలితం మాట యెలాగ ఉన్నా, ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. వ్యాపారంలో కొత్తవారి పోటీని యెదుర్కోవలసి వస్తుంది. ఆర్థికవ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వారం ఆఖరులో సాహసముతోకూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభించగలవు. రావలసిన డబ్బుమీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. సాహిత్యకళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వస్త్రసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**తుల:** కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. సాహసముతోకూడిన వ్యవహారాలు వారం మధ్యలో లాభించగలవు. ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. వృత్తిలో సాటివారితో పోటీ పెరుగుతుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభించగలవు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు

**వృశ్చికం:** వ్యాపారంలో సాటివారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కోర్టు వ్యవహారాల్లో అనుకూలతను సాధించగలరు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**ధనుస్సు:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి. సమయానికి యేదోఒక విధంగా డబ్బుచేతికి వస్తుంది. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం.** మీ ఆత్మవిశ్వాసమే అన్ని వ్యవహారాల్లోను అనుకూలతను సాధించగలదు. ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు బాగాఉంటాయి. ప్రయాణంద్వారా కార్యసాధన చేయగలరు. ఆర్థిక వ్యవహారాలు వారం మధ్యలో బాగా ఉంటాయి. రాజకీయవ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించగలవు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కుంభం** కొన్ని వ్యవహారాల్లో ప్రయాసమీద ప్రయోజనం మరొకరిది కాగలదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభిస్తుంది. సాంఘిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. అధికవ్యయం జరుగుతుంది.

**మీనం:** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. వారం మధ్యలో అనుకోని చికాకులకు గురికాగలరు. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరుతాయి.

—మహేష్

## ఒకవారం విపరీతం

# ఎం. ఎల్. ఎ. చిత్రవధ: సైకిల్ దొంగతనం

జరిగే దారుణాలకూ, వినే వింతలకూ ఓ హద్దూ పద్దూ లేకుండాపోయింది. తన పొలంలో పని చురుగ్గా సాగుతోందో, లేదో చూడ్డానికని సైకిలుమీద బయలు దేరిన జయరాజ్ అనే కాంగ్రెసు యమ్. ఎల్.ఏ. ని సావడె అనేచోట (కార్తైకాల్ కుంభకోణం రోడ్డుమీద) ఓ పదిమంది ఆపి, కొడవళ్ళతో ఆయన్ని చిత్రవధ చేసి ఆ సైకిలు తీసుకు మరీ పారిపోయారట. తరువాత ఆయన్ని చూసిన వారు నాగపట్నం ఆస్పత్రిలో జాయన్ చేశారు. కుడికాలు— మోకాలు వరకూ, ఎడమచై మణికట్టువరకూ నరికిపారేశారట. ఆరెండు భాగాలనూ ద్రావకంలో వేసివుంచారు డాక్టర్లు— ఇది యీనెల మూడో తేదీ పట్టపగలు పదకొండున్నర ప్రాంతంలో జరిగిందిట.!

*     *     *

డెబ్బయ్‌మంది మాత్రమే పట్టే జైలులో రెండువందలముప్ఫయిమందిని(సత్యాగ్రహులు)పెట్టవలసి వచ్చిందనీ, కావలసినన్ని జైళ్ళు లేకపోవడంవల్ల వున్న జైళ్ళు సరిపోకపోవడంవల్ల యిలాటి యిబ్బందులొస్తోయని— ఆ రెండువందల ముప్ఫయిమంది సత్యాగ్రహులకు వంటవండిపెట్టడానికి తగినన్ని పాత్రలు లేకపోయినందు వల్ల నాలుగైదు సార్లు వండవలసి కూడా వచ్చిందని— జైళ్ళమంత్రి శ్రీ ఇబ్రహిం ఆలీ హైదరాబాద్‌లో చెప్తూ వివరించారు భూగోళంలో చోటుకో పెద్ద సమస్య!!

చదువుకుందామన్నా సీట్లు దొరకవు. వుందామంటే అద్దెలకు మంచి యిళ్ళు దొరకవు చేద్దామంటే వుద్యోగాలు దొరకవు. చివరికి నేరం చేశాక జైల్లో చోటుకూడా దొరక్కపోతే ఎలా!!

కాల్‌టెక్స్ కంపెనీ యజమానులకూ, వుద్యోగస్థులకూ మధ్య వచ్చిన తగాదా మూలంగా పోలీసులు ఓనలభై తొమ్మండుగుర్ని (గతనెల) అరెస్టు చేశారనీ, ఎర్నాకులం జైల్లో చోటులేక— అక్కడ ఓ తొమ్మండుగుర్ని వుంచి, మిగిలిన నలభై మందిని మాట్టన్ చెర్రీ సబ్‌జైల్లో వుంచవలసి వచ్చిందనీ చోటు చాలక పోవడం వల్లే యీవిధంగా చేయవలసి వచ్చిందనీ— కేరళ ఆర్థిక శాఖామంత్రి శ్రీకుంజాం వెల్లడించారు. ఇక్కడా అదే సమస్య!

## ఏభయి లక్షల దోపిడీ— 'పవిత్రకార్యం'

పాట్నాదగ్గర బైశాహి అనే గ్రామంలో యీనెల రెండో తేదీన చరిత్రలో కనీ వినీ ఎరగని విడ్డూరం ఓటి జరిగింది. దోపిడీ ముఠా ఒకటి ఆవూరుమీద దాడిచేసేసరికి వూళ్ళోవాళ్ళంతా ఎదురొస్తున్నారట. అప్పుడా ముఠా నాయకుడు వాళ్ళని శాంత పరచి, తను చేయబోయేది పవిత్ర కార్యమనీ వడ్డీల ద్వారా రాబట్టిన పాపపు సొమ్మును నారాయణ షా అనే అతన్ని దోచి ఆ డబ్బు పంచిపెడ్తానని నచ్చచెప్పి శాంతపరచి యిళ్ళలోకి పంపేశాడట! ఆనక హాయిగా ఆ షా యింటిమీద పడి సుమారు యాభై లక్షల నగదూ, గట్రా అవీ మూటలు కట్టుకుని పోయాడట. ఇంకావచ్చి పంచుతాడు పంచుతాడు అని ఎదురు చూచిన జనం అతని తెలివికి అబ్బుర పడుంటారు. ఇరవైయ్యో శతాబ్దంలో యింత చక్కటి అద్భుతం జరగలేదని 'ఆశాఖ'వారు అభిప్రాయపడ్డారు— భేష్— బావుంది.

*     *     *

ఆహార ధాన్యాల ధరలు తగ్గాలనీ, పత్రికా స్వాతంత్ర్యపు శాతం ఎక్కాలనీ తూర్పుపాకిస్తానలో డక్కాలో విద్యార్థులంతా నినాదాలు చేశారు. విద్యార్థులలో హుషారు అధికం అయినందువల్ల పోలీసు శాఖవారు మొదట భాష్పవాయు ప్రయోగం ఆనక కాల్పులు జరిపారు. పారిపోయిన విద్యార్థులను వెంబడిస్తూ ఓ ఆసుపత్రిలోకి పోలీసులు జొరబడి అనుమానం కొద్దీ అక్కడ భాష్పవాయు ప్రయోగం చేసే సరికి తన రోగుల ఆరోగ్యం యీ భాష్పవాయువువల్ల అధ్వానంగా తయారయిందని అక్కడ డాక్టరు చికాకు పడ్డారు.

## బియ్యపు క్యూలో శిశువు మరణం

ఈరోజుల్లో బియ్యం కోసం క్యూలో నిలబడడం ఏమంత గొప్పకాదు. విడ్డూరమూకాదు. అయితే యీ పడిగాపుల్లో పడిన ఒకావిడ చేతిలో పసిపిల్ల ఆ తల్లి చేతిలోనే మరణించిందనీ, క్యూల్లో పన్నెండేసి గంటలు మానాభిమానాలు కూడా వదులుకుని ఓకిలో బియ్యంకోసం పడిగాపులు పడుతున్నారనీ— దీనికి ప్రభుత్వం ఏం సంజాయిషి యివ్వగలదనీ లోక్ సభలో ఇండిపెండెంటు మెంబరు శ్రీ యష్పాల్ సింగ్ చెప్పారు. ఈవిపరీతం ఎక్కడ జరిగిందో ఆయన చెప్పలేదు.

*     *     *

కోయంబత్తూరులో పార్వతీ అమ్మాళ్ అనే ఆవిడ దగ్గిర నలభై అయిదు రేషనుకార్డులు పట్టుకున్నారు. డబ్బులేక యిబ్బంది పడుతున్న వాళ్ళు తన వద్ద కార్డులను కుదువ పెడుతున్నారనీ, ఒక్కొక్క కార్డుకి రెండో, మూడో అయిదో తను యిస్తున్నానని, అలా యిచ్చిన డబ్బుకు రూపాయకు అణావడ్డీ పుచ్చుకుంటున్నాననీ ఆమె చెప్పింది. —అవును. ఆమెదేం తప్పు!!

## మంటలు-పుంటలు-మంటలు

ఇటీవల మద్రాసు ప్రాంతమంతా భయంతో గజగజ లాడి పోయింది. ఫలానా రోజున యిన్ని గంటలకు ఫలానా పేటలోని పాకలు తగల బెడ్తాం— చేవుంటే కాపాడు కోండి అని హెచ్చరిక చేసి మరీ అజ్ఞాతులు పాకల వాడలు వాడలు తగలేశారు. పాకలవాళ్ళంతా నడిరోడ్లమీదే సామానుతో సహా నివాసం ప్రారంభించారు. అయితే ప్రభుత్వం తీసుకున్న చర్యవల్ల భీభత్సం కొంచం సద్దుమణిగింది. మళ్ళీ మొన్న మూడో తేదీన నందనం, చామియర్స్ రోడ్ ప్రాంతాల్లో కొన్ని పాకలు తగలబడడం వల్ల— హమ్మయ్య అని నిబ్బరంగా గాలి పీల్చుకో బోయిన 'పాక' వాసులు వులిక్కిపడ్డారు.

*     *     *

నటుడు శ్రీ యమ్. జి. రామచంద్రాన్ని, శ్రీ యం. ఆర్. రాధ హత్య చేబోయాడా లేదా— అన్నవిషయం మీద మద్రాసు సెషన్సు కోరులో యింకా వాదోప వాదాలు తర్జన భర్జనలూ జరుగుతూనే వున్నాయి— అంతే!!

—పాలాక్షుడు



# చికాకుగా ఉందా? అజీర్ణంవల్లనే కావచ్చు

మీ జీర్ణశక్తి పోయినప్పుడు ప్రకోపాన్ని చెందుతారు. ఉత్సాహం తగ్గిపోతుంది నిలకడగా ఆలోచించలేరు. వ్యావహారికులైన మీవంటివారు పొగొట్టుకో తగరు. హ్యూలెట్స్ మిక్స్చర్ వాడి జీర్ణశక్తిని తిరిగి తెచ్చుకోండి. శీఘ్రంగా అమోఘంగా పనిచేయును. కడుపులో అది రక్షణ పూతగా ఏర్పడుతుంది. బాధ కలిగించే ఆమ్ల రసములను పరిపరచి తిన్న ఆహారము జీర్ణించుటకు ఉపకరించును.

హ్యూలెట్స్ మిక్స్చర్ చంటి పిల్లల జీర్ణాశయరోగములకు కూడ మంచిది

విరేచనములకు నల్లమందు కలిపిన హ్యూలెట్స్ మిక్స్చర్‌ను వాడండి.

C J హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
36/A పయనియప్ప నాయక్ స్ట్రీటు, మద్రాసు-1






## హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరించును




సరే ఆ రాత్రి వేళ మిస్టర్ బిగ్ 'చేపల గోదాము'లో నుంచుని ఉన్నాను........




చేపల తొట్టె అడుగున మట్టి ఎక్కువగా ఉన్నట్లుంది. తొట్టె లోపల విషప్రాణి సంగతి పట్టించిన తర్వాత ఈ సంగతేమిటో తెలుసుకోవటానికి నిశ్చయించుకున్నాను!




మిస్టర్ బిగ్ మత్స్యశాలలోని విషపు చేపల అంతు కనుక్కోవాలనుకున్నాను.




ఇదీ మిస్టర్ బిగ్ రహస్యం— 'ప్రమాదకర' మయిన చేప తొట్టెలో దొంగ బంగారం సరఫరా చేస్తున్నాడన్నమాట!




''కదలకు! చేతులు పయికెత్తెయి!''




దొంగ తుపాకి పేలుస్తూ ఉండగానే తలుపు వయిపుకి దూకాను—




ఇక ఆ మత్స్యశాల చేపతొట్ల మధ్య వింతయుద్ధం ఒకటి మొదలయింది. అయితే, నా తుపాకి దెబ్బ అందుబాటులో దొంగ లేడు, అతని 'మెషీన్‌గన్' నన్ను తేలికగా కొట్టెయ్య గలదు......




అందుచేత, ఒక తొట్టె ఎత్తి దొంగకి కనిపించకుండా తప్పుకున్నాను.










"ఏయ్ లిమీ! బయటికొచ్చావా సరే లేదా బాంబులు విసిరేస్తాను జాగ్రత్త—"

నా మోసం పనిచేసేట్లే ఉంది. చూద్దామను కున్నాను.........

"సరే లొంగిపోతా, నా మడమ ఒకటి విరిగింది కాబట్టి! ఇంకెందుకో కాదు......"

"సరే తుపాకి కిందపడేసి చేతులెత్తి బయటికిరా"










దొంగ చెప్పినట్లే చేశాను. తుపాకి కింద పడేశాను. కాని నాకు దొరికిన మిస్టర్ బిగ్ బంగారు నాణెం ఒకటి తీసుకువచ్చాను.

"నిన్ను కొన్ని ప్రశ్న లడుగుతా లిమీ— జవాబు చెప్పు—"

బంగారు నాణెం కింద పడేశాను.

దొంగకళ్లు దానిమీద పడ్డాయి. అదే క్షణంలో ముందుకి ఉరికాను.







దొంగని ఎలాగయితే నేమి మత్స్యశాలలో ఒక పక్క దారిలోకి 'పంపాను.'—

హఠాత్తుగా నేలలోని తలుపొకటి తెరుచుకుంది.

(ఇంకా ఉంది)

'తల్లులయిన సినిమా తారలకి తమ పిల్లల ఆలనా పాలనా చూసే తీరిక వుంటుందా ? కారుల్లో తిరుగుతారు. స్టూడియోల్లో వుంటారు. ఇంటి దగ్గర యీ పిల్లల్ని ఏ 'ఆయా'తో పెంచుతారు వాళ్ళకి మమకారమూ, ప్రేమా ఉంటాయా?' అని కొందరు అనుకోవటం నేను విన్నాను. ఇది చదివితే—అది కేవలం 'అనుకోవటమే' ననీ, నిజం కాదనీ తెలుస్తుంది.

* * *

1967 జూలై 30 వ తేదీ రాత్రి 'పెదర్ సిస్టర్' (ఎదురీత) నాటకంలో పాల్గొని పొద్దుపోయి యింటికి వచ్చారామె. మమ్మీ రాకకోసం ఎదురు చూస్తున్నాడు తమ్ము. కొంతసేపు గడిచాక ఆమె దగ్గరికి వెళ్ళి 'అమ్మా, రేపు హైదరాబాద్ వెళ్ళి పోతున్నావా ?' అని అడిగాడు పదహారేళ్ళ తమ్ము. ఆమె 15 రోజులవరకూ హైదరాబాద్‌నుంచి రాదని అతనికి తెలుసు. తలెత్తి తన ముద్దుల కొడుకు మొహంలోకి చూసిందా తల్లి. ఆ పసివాడి కళ్ళు అర్ద్రమవుతున్నవి. 'అన్నిరోజులు అక్కడుంటే ఎలా—వుండొద్దు. వచ్చెయ్ త్వరగా' అని వాడింకా నిద్రపోకుండా తన గురించే ఆలోచిస్తున్నాడన్నమాట! తనని చూడకుండా అన్నిరోజులు ఎలా వుండటమా అని బాధపడుతున్నాడని గ్రహించగానే ఆ మాతృహృదయం కరుణతో కరిగింది ఆమె కన్నులు ఆర్ద్రమయినవి. కొడుకుని దగ్గరకు తీసుకుని దుఃఖాన్ని గొంతులోనే దిగమింగుకొని 'తమ్మూ, మళ్ళీ వచ్చేస్తాగా పదిహేను రోజుల్లో!' అన్నది.

* * *



అలా అన్న మాతృమూర్తి జానకి తమ్ము (అసలు పేరు వెంకటరమణ) ఆమె సంతానంలో రెండోవాడు. మొదటి సంతానం, మూడో సంతానం ఆడపిల్లలు, పెద్దమ్మాయిపేరు యజ్ఞప్రభ. ఆమెకి పెళ్ళి అయింది ఈ మధ్య ఒక బేబీ కూడా పుట్టింది యజ్ఞకి చిన్నమ్మాయి పేరు కృష్ణశచి. ఇంట్లో అంతా ముద్దుగా 'అమ్ములు' అని పిలుస్తారు. అమ్మాయిని అలాగే వెంకటరమణని 'తమ్ము' అంటారు.

* * *

'యజ్ఞ చాలా ఫ్రాంక్ అమాయిక. ఏడవ్వా అంటే ఏడ్చేస్తుంది తమ్ము — మాట పడడు. టూ సెన్సిటివ్. మొత్తం పిల్లల్లోకి వాడంటే నాకు విక్రత యిష్టం ... ఒకసారి వాడు అమ్ములన్ని కొట్టాడు. అది ఏడవటం—వాడు అల్లరీ... ఇదంతా చూసి 'ఏమిట్రా న్యూసెన్స్ చేస్తున్నావ్, అవతలికి ఫో' అన్నాను నేనేదో చిరాకులో అంటే నిజంగానే అవతలికి పోయాడు తర్వాత కొంతసేపటికి జ్ఞాపకం వచ్చింది, వాడు మాటపడడని. ఇంట్లో లేడు మధ్యాహ్నం భోజనానికి కూడా రాలేదు తమ్ము ఎక్కడికి వెళ్ళిపోయాడో, ఏమయ్యాడో అని ఆత్రతగా వుంది అంతో తన పడుతోంది మనసు ఏందుకన్నానా అని చాలాసేపు బాధపడ్డాను బస్సులమీద, సైకిళ్ళమీద మనుష్యుల్ని పంపాను, వెళ్ళి ఎక్కడున్నా వెతికి తీసుకురమ్మని ఆ సాయంకాలం యింటికి చేరాడు 'మమ్మీ బెంగ పెట్టుకుందని విని మళ్ళీ వచ్చాను.' అన్నాడు ఆరోజు నుంచి పది రోజులు మాట్లాడలేదు, నాతో ఆవేశంతా నన్ను కంగారు పెట్టేశాడు. అంత పౌరుషం వాడికి ఇది చాలా కాలం కిందటి సంగతి అనుకోండి ఇప్పుడు వాడు మెట్రిక్ చదువుతున్నాడు' అంటూ జానకి వో క్షణం ఆగి—'ఇక మూడోది అమ్ములు — షో చేస్తుంది తన సుపీరియారిటీ కనపరచుకోవాలనుకుంటుంది అందర్నీ వాటలం టుంది. దబాయిస్తుంది వెరీ సెన్సిటివ్. సెవెన్త్ స్టాండర్డ్ చదువుతోంది' అన్నారు.

* * *

'ఏ తల్లీ తన బిడ్డలకి యివ్వనంత స్వేచ్ఛ నా పిల్లలకి యిచ్చాను స్వేచ్ఛ లభించింది కదా అని వాళ్ళు యిష్టం వచ్చినట్లు తిరగరు. వాళ్ళకే లోపమూ రానివ్వను.' 'మమ్మీని పాకెట్ మనీ అడగరా !' అని మావాడి స్నేహితులు వాడికి చెబితే— 'పాకెట్ మనీ ఎందుకూ అడగటం ? మమ్మీ నాకు కావలసినవన్నీ యిస్తోందిగా!' అంటాడు. నా బిడ్డలమీద నాకు ప్రేమ, అభిమానం, వాత్సల్యం ఉన్నాయి. వాళ్ళు కోరింది ఏదీ కాదనను. వాళ్ళ మనసు కష్టపడకుండా చూస్తాను. వాళ్ళకి అభ్యంతరాలు చెప్పను. బిడ్డలు బాధపడుతూంటే ఏ తల్లి అయినా చూస్తూ వూరుకోగలదా ?...'

ఎందుకింత ఎఫెక్షన్ ?

'...మా వాన్నకి పెట్ చైల్డ్‌ని నేను,



వరుసగా శ్రీమతి జానకి, చి॥ కృష్ణశచి, (అమ్ములు), శ్రీ ఉదయభాను, చి॥ వెంకటరమణ (తమ్ము), చి॥ యజ్ఞప్రభ (శ్రీమతి ఉదయభాను).

మా అమ్మకి మా చెల్లెలు కృష్ణ మీద చూపిస్నంత ఎఫెక్షన్ నా మీద లేదు. తల్లి ప్రేమకు దూరమయ్యాను ఇది నిజం! నా విషయంలో ఒకసారి రుజూ అయింది కూడా. నా తల్లినుంచి నేను ప్రేమ పొందలేదనే వేదనే—నా పిల్లలపట్ల నాకు ప్రత్యేక శ్రద్ధ కలగటానికి కారణం' అంటారు జానకి.

* * *

మామూలు కుటుంబ స్త్రీల వలెనే — సినిమాతారలయిన తల్లులకీ హృదయం వుంటుంది తమ రక్తం పంచుకుపుట్టిన బిడ్డల్ని ప్రేమతో సాకే గుణం మాతృత్వం తోటే వాళ్ళకీ వస్తుంది డబ్బూ, పెద్ద పెద్ద మేడలూ, షోకీకారులూ వున్నంత మాత్రన— వాళ్ళు మనసులులేని మనుషులనీ, పిల్లలపట్ల అవ్యాజమైన ప్రేమానురాగాలు ఉండవనీ అనుకోవటం అపోహే అవుతుంది. ఎంతటి తారలైనా వాళ్ళలోని మాతృత్వం ఎక్కడికి పోతుంది?

—మోహన్‌కుమార్



కుటుంబసమేతంగా శ్రీ అక్కినేని నాగేశ్వరరావు. పిల్లలు చిరంజీవులు సత్యవతి, వెంకటనారాయణరావు, సుశీల, సరోజ, నాగార్జునరావు. ఆడపిల్లలు మారేడ్‌పల్లిలోని సెయింట్ ఆన్స్ కాన్వెంట్‌లో, మగపిల్లలు బేగంపేటలోని పబ్లిక్ స్కూల్లో చదువుకుంటున్నారు.

## అవీ-ఇవీ

### పద్మశ్రీ బిరుదు

శ్రీ వింజమూరి వెంకట లక్ష్మీ నరసింహారావు గార్ని 'పద్మశ్రీ' బిరుదంతో భారత ప్రభుత్వం సత్కరించింది. శ్రీ నరసింహారావుగారు కవులు, కళాకారులుగాను, వివిధ గ్రంథ రచయితగాను, నటుడుగాను ఆంధ్రులకు సుపరిచయులు. వారి 81 వ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకుని పుర ప్రముఖులతో కూడిన సంఘం వారిని సన్మానించింది. మద్రాసు సంగీత నాటక ఎకాడమీ ఉపాధ్యక్షులు శ్రీ కె. సుబ్రహ్మణ్యం ప్రభుత్వం తరపున 'పద్మశ్రీ' బహుమతి పతకాన్ని శ్రీ నరసింహారావుగార్కి అందజేశారు. సభకు శ్రీ గోవింద రాజులు నాయుడు (దక్షిణ భాషా పుస్తక సంస్థ అధ్యక్షులు) అధ్యక్షత వహించారు. శ్రీయుతులు యస్. కె. ఆర్. దీక్షితులు, బండి రామమోహన రావు మొదలైనవారు శ్రీ నరసింహారావుగారి గుణగణాల్ని ప్రశంసిస్తూ ప్రసంగించారు. శ్రీ బాల మురళీకృష్ణ, శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు తదితరులు కవిగారి పద్యాల్ని వినిపించారు. సన్మాన సంఘ అధ్యక్షులు శ్రీ జె. వి. సోమయాజులు సభికులకు స్వాగతం చెప్పారు. కార్యదర్శి శ్రీ పి. వి. కోదండరావ్ వందన సమర్పణ చేశారు.

—సీకరాజు



శ్రీవింజమూరి వెంకట లక్ష్మీనరసింహారావు



'ఉపాయంలో అపాయం'లో దేవి పద్మిని.

# సక్రమ ప్రవర్తనకీ సహకార జీవనానికీ

# బాలభట సంఘాలు

ప్రొద్దస్తమానం ఒకే గదిలో కూర్చుని పాఠాలు నేర్చుకోవడం విద్యార్థులకు విసుగ్గా వుంటుంది ఆటలు, పాటలు, వినోదాలు వంటి కార్యక్రమాలు వారికి అవసరం.

విద్యార్థుల మనోప్రవృత్తిని, అభిలాషను అనుసరించిన కార్యక్రమాలు ఎంతయినా ప్రోత్సాహకరంగా వుంటాయి.

పాఠశాలలో చదువును మినహాయించిన వ్యాసంగాలు చాలా వున్నాయి వాటిలో కొన్ని బాలభట సంఘాలు, ఎ. సి. సి, ఎన్ సి సి, ఫిజికల్ ఎడ్యుకేషన్, సాంస్కృతిక కార్యక్రమాలు

అన్నిటికంటె మించి బాలభట సంఘాలంటే విద్యార్థులు ఎక్కువ మోజు చూపిస్తూ వుంటారు.

ఆటవిక జీవితమంటె పిల్లలు చెవి కోసుకుంటారు. నిత్యమూ అన్వేషణ చేయడం, సాహసోపేతమైన పనుల్ని చేయడం వారి నయిజం. బాలభట సంఘంలోని కార్యక్రమాలన్నీ వారి అభీష్టాన్ని నెరవేర్చే విగా వుంటాయి. అవకాశమున్న ప్రతి విద్యార్థి ఈ ఉద్యమం మీద మొగ్గు చూపిస్తాడు.

## సర్వదా సంసిద్ధం!

కాకీ చొక్కా, కాకీ నిక్కరు, మోకాలి వరకూ మేజోళ్ళు, అన్ని వాతావరణాలకీ సరిపోయే బూటు, మెడ చుట్టూ రుమాలు (స్కార్ఫ్), దానిని బిగిస్తూ ఒక ముడి (వాగల్), భుజానికి దళాన్ని సూచించే పూలు పట్టీ (షోల్డర్ స్ట్రాప్), మెడలో విజిల్, నెత్తి మీద టోపీ, నడుముకి బెల్టు, దానికి వేలాడుతూ చాకు, దిక్సూచీ, తాడు, చేతిలో కర్ర, కొట్టొచ్చినట్టు కనిపిస్తూ చొక్కాకు అంటించిన బేడ్జి!

ఇంతగా అలంకరించుకుని, ప్రతి పనికీ 'సర్వదా సంసిద్ధం' అనే బాలభటుడంటే ఎవరికి ఇష్టముండదు గనుక? అలా బాలభటుడుగా వుండాలని ఏ విద్యార్థి ఉవ్విళ్ళూరకుండా వుంటాడు?

చిటికెన వేలుని మడిచి బొటన వేలితో నొక్కిపెట్టి, మూడు వేళ్లతో 'శాల్యూట్' చేస్తున్నప్పుడు బాలభటునిలో ఠీవీ దర్పమూ ఇనుమడించడం కనిపిస్తుంది.

'దేవుడికీ దేశానికీ
నా ధర్మాన్ని నేను నిర్వర్తిస్తాను.
ఇతరుల కెల్లప్పుడూ
సహాయం చేస్తాను.



సర్వదా సంసిద్ధం!
(కేసరిహయ్‌స్కూలు బాలభటసంఘ విద్యార్థి.)
— ఫొటో: ప్రభాకర్

బాలభట సంఘం యొక్క
సూత్రాలను శిరసావహిస్తాను'

అనే ప్రతిజ్ఞను చేసి బాలభటుడుగా గుర్తించబడినప్పుడు అతనిలో ఉత్సాహం ఉరకలు వేస్తుంది

మెడ చుట్టూ రుమాలు (స్కార్ఫ్) తొడిగి,— 'నువ్విప్పుడు బాలభటుడివి, నీ విధిని నిర్వహించు' అని శిక్షకుడు అభినందిస్తున్నప్పుడు బాలభటుడి కళ్ళల్లో ఒక రకమైన వెలుగు ద్యోతకమవుతుంది. అతిశయం కనిపిస్తుంది.

బాలభటుడు కొన్ని సూత్రాలపైన నడుస్తాడు. వాటికి కట్టుబడి ప్రవర్తిస్తాడు. సామాజిక విజ్ఞానాన్ని వికసింపజేసుకుంటాడు.

బాలభటులు అన్ని రంగాల్లోను సుశిక్షితులుగా ఉంటారు.

ఆడించుతూ, పాడించుతూ వివేకాన్ని, విజ్ఞానాన్ని పెంపొందించగల కార్యక్రమాలు ఈ ఉద్యమంలో వున్నాయి.

బాలభటోద్యమం న్యూనతా భావాన్ని సడలించడమే కాకుండా ఆత్మబలాన్ని చేకూర్చుతుంది. నాయకత్వపు లక్షణాలను వెలికి తీస్తుంది. వ్యక్తిగత గుణగణానికి జీవం పోస్తుంది.

## విధ్యుక్త ధర్మం

బాలభటుడు ఏ క్షణంలోనయినా సరే సహాయం చేయడానికి సంసిద్ధంగా వుంటాడు. అది అతని విధ్యుక్త ధర్మం.

ఎదురయిన సమస్యని ఛేదించడానికి కాలయాపన చేయడు. తగిన పరికరాలు లేవే అని చింతించడు. యుక్తిచేత శక్తిచేత దానిని సునాయాసంగా పరిష్కరించగల నేర్పును కలిగివుంటాడు.

రోజూ ఒక మంచి పని చేయడం బాలభటుని విధి, ఇలా చేయగా చేయగా అతనికి నిస్స్వార్థమైన తత్వం అలవడుతుంది.

వంట చేయడం దగ్గర్నుంచి అడవుల్లో ఒంటరిగా ప్రయాణం చేయడం వరకు బాల

భటుడు నేర్చుకుని వుంటాడు.

ఎవరి పనులు వారే చేసుకుంటూ ఇతరులకు సహాయం చేయడమే బాలభట సంఘాల ముఖ్యోద్దేశం.

**క్యాంపులు**

అటవీ ప్రాంతాల్లోనో, నిర్మానుష్యమైన ప్రదేశాల్లోనో 'క్యాంపులు' వేసుకుని ధైర్య సాహసాలకి పదును పెట్టుకుంటారు.

ఒకొక్కసారి ఎన్నో కష్టనష్టాలు ఎదురవుతూ వుంటాయి. వాటినన్నిటినీ చిరునవ్వుతో ఎదుర్కొంటారు. తెలియని వాటిని తెలుసుకోవడం కోసం సాహసోపేతమైన పనుల్ని బాలభటులు నిత్యమూ చేస్తూ వుంటారు.

'క్యాంపు'అంటే బాలభటులికి ఎంతో సరదాగా వుంటుంది. స్వంత యిళ్లకు దూరంగా ఒక సరికొత్త ప్రదేశంలో తోటి మిత్రులతో కాలక్షేపం చేయడమంటే వారికి మహదానందం!

**కార్యక్రమాలు**

త్రాళ్లతో రకరకాల ముళ్లు నేర్చుకొని, ఆ ముళ్ల ఉపయోగాలు తెలుసుకుంటారు. సంకేతాల ద్వారా వార్తలని పంపించడం, వింత వస్తువుల్ని సేకరించడం, కొత్త ప్రదేశాల్ని చూడడం, అదిగాగల కార్యక్రమాలతో పగటిపూట వారి కార్యక్రమం ముగుస్తుంది.

రాత్రుళ్లు 'క్యాంప్ ఫయిర్' వేసుకుంటారు. బాలభటులకు అత్యంత ఆనందదాయకమైంది ఇది. మధ్యలో పుల్లల్ని పేర్చి మంటవేస్తారు. చుట్టూ కూర్చుంటారు. మధ్య ఆవరణలో చిన్నచిన్న ప్రహసనాల్ని ప్రదర్శిస్తారు. అభినయం చేస్తారు. పాటలు పాడతారు. సామూహికంగాను విడివిడిగాను కార్యక్రమాలు ఏర్పరచుకుని వినోదాలు చేసుకుంటూ వారిలో వారు ఉత్సాహ ప్రోత్సాహాల నందజేసుకుంటారు.

**ప్రోత్సాహం**

వివిధ రంగాలలో నేర్పు, పనితనాన్ని బట్టి బాలభటుల్ని 'బ్యాడ్జి'లతో సత్కరించడం వుంటుంది. ఎక్కువ బాడ్జిలను ఆర్జించుకోడానికి ప్రతి బాలభటుడూ కృషి చేస్తాడు.

ఒక దళం (ట్రూప్)లో ఇరవై మంది నలభై వరకు బాలభటులుంటారు. అందులో వివిధమైన జట్టులుంటాయి. జట్టుల్ని 'పెట్రోల్స్' అంటారు. ఈ జట్టులకు సింహాలని, పులులనీ, తోడేళ్లనీ, గ్రద్దలనీ పేర్లుంటాయి.

బాలభట సంఘాలను బాలురకు మాత్రమే కేటాయించడాన్ని బాలికలు సహించలేక పోయారు అంటే అది ఎంత ప్రోత్సాహకమైన ఉద్యమమో తెలుస్తూనే వుంది. బాలికల కోరికపైన బాలభట సంఘాన్ని వారికీ కూడా అనువర్తించారు!

బాలభట సంఘాల్ని మూడు తెగలుగా విభజించారు. పెద్దవాళ్ల కోసం 'రోవర్సు', బాలబాలికలకు 'స్కౌటింగ్' 'గయిడింగ్', చిన్న పిల్లలకు 'కబ్స్'.

పూర్వం, యుద్ధ సమయంలో వార్తాహారులుగా వుండడానికి నియోగించబడిన బాలభట సంఘాలు — విద్యార్థులనందరినీ సక్రమమార్గంలో నడిపించడానికి ఇప్పుడు దివ్యమైన ఉద్యమంగా తయారయింది.

ఉద్యమ సంస్థాపకుడు కే. శే. బేడెన్ పవెల్‌కు ప్రపంచమంతా జోహార్లర్పిస్తున్నది.

సక్రమ ప్రవర్తనతో పాటు— దయ, దాక్షిణ్యం, సానుభూతి, పరోకార చింతన, పెద్దలయెడ భక్తితాత్పర్యాలు, దైవభక్తి మొదలయిన సద్గుణ సంపత్తిని వృద్ధి చేసుకుంటూ ప్రకృతిని ప్రాణుల్నీ ప్రేమించడానికి తగిన మనోవికాసాన్ని బాలభటుడు సంపాదించుకుంటాడు.

**ఉద్యమము - ఉద్ధరణ**

మన పాఠశాలలకు సంబంధించిన బాలభట సంఘాలకు తగిన వసతులు అట్టే వుండడంలేదు. అందుచేత రోజువారీ కార్యక్రమాలకు కొన్ని ఆటంకాలు ఎదురవుతూ వుంటాయి.

కాని, బాలభటుడికి అసాధ్యము, అవాంతరము అంటూ వుండవు. ఎక్కడయినా, దేనినయినా పరిపుచ్చుకుపోగల మనస్తత్వం అతనికి అలవడుతుంది. అందుచేత అతను ఎటువంటి కార్యాన్నయినా నిర్విఘ్నంగా కొనసాగిస్తాడు. సాధిస్తాడు.

బాలురలో కలిసిపోయి వారిలో తనూ ఒకడు అనుకునే సమర్థులైన శిక్షకులున్నప్పుడు బాలభట సంఘాలు భావిభారత పౌరుల్ని తీర్చిదిద్దుతాయి. సంఘానికి, జాతికి, జాతీయతకు ఎంతయినా సేవ చేస్తాయి.

విద్యార్థుల్లో క్రమశిక్షణ కొరవడుతున్నది, పెచ్చుపెరిగిపోతున్నారు అని నాయకులు, విద్యావేత్తలు నేడు బుర్రలు బద్దలు చేసుకుంటున్నారు.

బాలభట సంఘాల్ని పునరుద్ధరించి, వాటికి ఎక్కువ గుర్తింపు నిచ్చినట్టయితే విద్యార్థులకు సంబంధించిన సమస్యలు చాల వరకు తీరిపోతాయనడంలో అతిశయోక్తి ఏమీ లేదు !

సి. కనకాంబరరాజు



## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన

నం.

# బొమ్మల నుడికట్టు

**జ వా బు లు**

(88 వ పేజీ తరువాయి)

**అ డ్డం :**

1. చిలుక
3. అగ్ని
4. లఘువు
6. విగ్రహం
7. నుడువు
8 నగము
10 పాపాయి
11 నగదు
12. ఈగ
13 కటారి

**ని లు వు .**

2. కలహం
3 అవును
5 పావురాయి
6 విమానము
9 మునగ
10. పాదుక



# మేడకు కట్టిన మేక

(23 వ పేజీ తరువాయి)

**జ వా బు లు**



(క) గోడను 1వ బొమ్మలో చూపినట్లు కట్ట వచ్చు ఇంతకన్న చవకలో (తక్కువ పొడ



వులో) కావాలంటే 2వ బొమ్మలో చూపి నటు గోడను కట్టాలి




(చ) ఇక్కడి బొమ్మలో చూపినట్లు నాలుగు సరిసమాన భాగాలు చేయవచ్చు

*   *   *

(ట) ఇక్కడి బొమ్మలో A B C అనే సమ బాహు త్రిభుజ వైశాల్యం 2000 చ గ అనుకుందాం నల్లని భాగం మేక మేయ గలిగిన 1000 చ గ స్థలం అనుకుందాం బొమ్మలో చూపినట్లు 6 సమబాహు త్రిభు జాలతో క్రమషడ్భుజిని తయారుచేసి, మధ్యలో C D వ్యాసార్థంగా వృత్తం గీస్తే, నల్లని భాగం ఆ వృత్త వైశాల్యంలో 6వ వంతు అని తెలుస్తోంది ఆ వృత్త వ్యాసార్థం R గజములు అయితే, దాని




వైశాల్యం $= \pi R^2 = 6 \times 1000$ చ గ.
లేక $R = 43\ 7$ గజాలు

ఇదే మేక మెడకు కట్టిన తాడుపొడవు ●

# ధర్మ పథం

(16 వ పేజీ తరువాయి)

చెట్లను నరికి, గ్రామ నిర్మాణానికి పూను కోవడం మానివెయ్యాలి మానివెయ్యాలనే నా దృఢసంకల్పం' అని

'ఎందుకు మానివెయ్యాలి?' అని ఒకరన్నారు

'మనం ప్రజల సౌకర్యానికి యీ పని ప్రారంభించాం! కాని దీనిమూలంగా జీవ నాధారమే నశిస్తుంది దాన్ని నశింపజేసి గ్రామ నిర్మాణం చేస్తే ఏం ఉపయోగం?' అని జవాబు!

'దీనికి దానికీ సంబంధం యేమిటి?' అని ప్రశ్న వచ్చింది

'మీరు బాగా వినండి మనం చెట్లు నరుకుతూ పోతే అడవులు పలచబడి, చివ రికి చెట్లులేకుండా పోతాయి అందువల్ల వర్షాలు కురవడానికి అవకాశం ఉండదు వర్షాలు లేకపోతే పంటలు లేవు, ప్రాణికోటి బ్రతకదు పాడిపంటలు సర్వశూన్యం అవు తాయి ఆ మీద జరిగేదేమిటో ఆలోచించు కోండి' అని పరశురాముడు చెప్పాడు

ఇక నేముంది?

మర్నాటి నుంచీ అక్కడి వారందరూ మొక్కలను నాటి, వాటిని పెంచే కార్య క్రమానికి సిద్ధపడ్డారు కొద్దికాలంలోనే ఆశ్రమం కలకలలాడ సాగింది ఎక్కడ చూచినా ఫలవృక్షాలు! పూలమొక్కలు!

భార్గవరాముని తృప్తికి మేరలేదు ●

Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras 1. Chief Editor. S. Sambhu Prasad.

# ఎన్నో రకాలు ఎన్నుకోవడానికి

రేడియోలు మరియు ట్రాన్సిస్టర్లు
రు. 125 లు మొదలుకొని వున్నాయి





మోడెల్ టిఐ 0816



మోడెల్ టిఐ 0581



మోడెల్ టిఐ 0579



మోడెల్ టిఐ 0509



మోడెల్ టిఎ/టియు 0777



మోడెల్ టిఎ 0926



మోడెల్ టిఎ/టియు 0202



మోడెల్ టిఎ/టియు 0776



మోడెల్ టిఎ/టియు 0824



మోడెల్ టిఎ 0366

వాటిని మీ స్నేహితుడైన మర్ఫీ డీలరు వద్ద యీరోజే చూడండి.

**murphy** మర్ఫీ మీ గృహానికి ఆనందాన్నిస్తుంది!

*Murphy sets the standard*

NAS b142d